**వెంట వచ్చేది ధర్మమొక్కటే :** వివిధ రూపములలో ప్రోగుపడి ఉన్నసంపదలు అన్నీ ఆ యజమానులకు ఇహలోకంలో కూడా, (రోగగ్రస్థులైతే) ఎంతవఱకు ఉపయోగపడతాయో తెలియదు. కానీ, పరలోక మార్గంలో వెంటరావు. ధనం, భూమిలో దాచినచోటే ఉంటుంది. అభిమానంతో పెంచుకొన్న పశువులు గోశాలలోనే ఉంటాయి. ప్రేమైక పాత్రురాలు భార్య ఇంటిగుమ్మంలోనే నిలిచిపోతుంది. బంధువులు, స్మశానం దాకానే వస్తారు. వ్యామోహంతో పోషించుకొన్న ఈ దేహం చితిలోనే కాలిపోతుంది. జీవులకు వారు చేసిన ధర్మ (పుణ్య) మొక్కటే పరలోక మార్గంలో వెంట వస్తుంది. అందువల్ల శాశ్వతమైన ధర్మమాచరించటానికి త్వరపడండని పెద్దలు ప్రబోధించారు. చిత్తము (మనస్సు) విత్తము (ధనము) జీవితము (ప్రాణము) క్షణికమే. ఆయుర్దాయం తీరిన తర్వాత యముడు జీవులను క్షణం బ్రతుకనీయడు. ముందుగా తీసుకుపొమ్మని ఎంతవేడుకొన్నా వినడు.

క్షణంచిత్తం, క్షణం విత్తం, క్షణం జీవితమావయోః ।
యమస్యకరుణా నాస్తి, ధర్మస్య త్వరితాగతిః ॥

వాఙ్మయసారసర్వస్వమైన ఈ జ్ఞానదీపము, ఆత్మవిద్యకు మార్గాన్ని సూచిస్తుంది. ఆత్మోద్ధరణకు తోడుపడుతుంది.

**దీపమున్నప్పుడే ఇల్లు చక్కదిద్దుకోవాలి :** జీవి శరీరంలో ప్రాణమ్మున్నప్పుడే ధర్మ కర్మములు చేసి కీర్తి సంపాదించుకొంటే, అస్థిరమైన శరీరం పడిపోయినా కీర్తి కాయంతో చిరకాలం ఈ భూమిపై బ్రతుకవచ్చు. పుణ్యాలోకాలలోను, విహరించవచ్చు.

దేహే పాతిని కారక్షా । యశోరక్ష్యమపాతవత్ ।
నరః పతితకాయోఽపి, యశఃకాయేనజీవతి ॥ (భోజచరిత్ర)

అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతంగమయ.

సహనా వవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై, ఓంశ్శాంతి శ్శాంతి శ్శాంతిః ।



భావ వినిమయానికి ఉపయోగపడే సాధనములలో (భాష) మాట కూడా ఒకటి. అక్షర రూపమైన (నశింపని) ఈ వాక్కు చరాచరమైన ప్రాణికోటి నుండి మానవుని వేరు చేసి, లోకంలో అతనికొక విశిష్ట స్థానాన్ని కల్పించింది. తినటం, కనటం ప్రాణులన్నింటికి సమానమే అయినా, మానవులకు విద్యా, వివేకములు అధికంగా లభించాయి. మానవ జాతి గౌరవానికి కారణములైనాయి.

తక్కిన ప్రాణులకు జీవితంలో కలిగే సుఖదుఃఖాది అనుభవములు, వాని వఱకే పరిమితమై, వానితోనే అంతమై పోతాయి. మానవజాతికి మాత్రం పెద్దల అనుభవములు, అక్షరరూపమునుదాల్చి తరువాతి తరములవారి అభివృద్ధికి దోహదం చేస్తున్నాయి. మన పెద్దల మాటలే పూల బాటలై వరహాల మూటలై మనజీవన వ్యవసాయానికి మూల ధనంగా, ప్రగతి సౌధానికి సోపానాలుగా నిలుస్తున్నాయి.

ఆ విజ్ఞాన సంపదతో మానవుడు ఎన్నో విజయాలు సాధించాడు. వింతలు, విశేషాలు సృష్టించాడు. ఇంతటి గొప్పతనానికి కారణమైన వాక్కుఅతనికొక విశేషమైన అలంకారమై భాసించింది. 'భౌతికంగా ఏర్పడిన భూషణములు ఎన్ని ఉన్నా, అవి అన్నీ నశించేవే అని వాగ్భూషణమే నిజమైన భూషణమని భర్తృహరి వక్కాణించాడు. ఆ మాటల వైఖరి వలననే మనిషి మనీషిగా గౌరవింపబడతాడు. అందుకే మనవారు "వస్త్రము, వపుషము, (రూపము) వాక్కు, విద్య, వినయము" అనేవి వకార పంచకమని (5) చెప్పి ఇందులో ఏది తక్కువ అయినా అతడు పూజార్హుడు కాదని చెప్పారు.

వాక్కు అంటే మాట (శబ్దము) అని, మాటకొక అర్థం ఉంటుందని, ఆరెండింటికి గల అవినాభావ సంబంధాన్ని నిరూపిస్తూ, కాళిదాస మహాకవి 'లోకములకు తల్లిదండ్రులయి, వాగర్థములవలె నిత్యము కలిసి ఉండేవారయిన పార్వతీ పరమేశ్వరులు తనకు వాగర్థసిద్ధిని కలుగజేయాలని భక్తితో ప్రార్థించాడు.

వాగర్థావివసంపృక్తౌ, వాగర్థప్రతిపత్తయే!
జగతఃపతరరౌ వందే, పార్వతీపరమేశ్వరౌ!!

**జ్ఞాన జ్యోతి :** జ్ఞానరూపమగు శబ్దజ్యోతియే లేనినాడు, ఈ లోకమే చీకటితో నిండి ఉండేది. అజ్ఞాన – అహంకార పిశాచములే జగములందంతటా తాండవము చేసేవి.

సృష్టి, తత్త్వాన్వేషకులైన ఋషులు తమ తపశ్శక్తిచే మొదట అపౌరుషేయములగు వేదములను వినగలిగారు. చెవులచే వినబడినవి కావున అవి 'శ్రుతులు' గా ప్రసిద్ధములయినవి.

'వేదము' అంటే తెలియదగినది (విజ్ఞానము) అని అర్థము. విశ్వ విజ్ఞానమును వివరించు శబ్దస్వరూపమే (మాటలే) వేదము. ధర్మ విశిష్టమైన భారతీయ సంస్కృతికి ఆ వేదమే మూలము. అందులో సృష్టితత్త్వమును, ఆత్మధర్మమును గూర్చిన అనేక విషయములు చెప్పబడ్డాయి. ఆ వేదము ఋక్, యజు, స్సామ; అధర్వణములు అను పేర నాల్గు విధములుగా విభజింపబడింది. అందలి ధర్మములను స్మరించి లోక సామాన్యమునకై సరళమగు రీతిలో తిరిగి చెప్పబడినవి స్మృతులు.

'వేదము' అన్న శబ్దమునకు ప్రమాణము అనే అర్థం కూడా ఉంది. 'విస్సన్న చెప్పింది వేదం' అన్న వాక్యం ఈ విషయాన్నే తెలియజేస్తుంది. 'నీమాట – ఏమైనా వేదమా ? నమ్మటానికి' అంటంలో 'వేదము నమ్మదగింది' అనే భావం వ్యక్తమవుతుంది. వేదములకు చివర చెప్పబడినవి ఉపనిషత్తులు కావున అవి 'వేదాంతములు' అని పిలువబడతాయి. అందులో విశ్వమునకు ఆధారమైన బ్రహ్మమును గూర్చి బోధింపబడినది.

అధ్యయన శీలంతోబాటు ఆలోచనా ధోరణిగల వారి కొఱకై విశ్వసనీయమైన ఆ వేద ధర్మమును తపోమహనీయులై మాననీయులైన మహర్షులు పురాణ – ఇతిహాస, కావ్య, రూపకములలో మనకు అందించారు. మానవులకు ధర్మము ఆచరణ సాధ్యమే అని నిరూపించారు.

వేద వేద్యుడైన ఆ పరమ పురుషుడు ధరణిపై దశరథ తనయుడైన రాముడై అవతరింపగా, వేదమే, ప్రాచేతసుడైన వాల్మీకి ఋషి నోట రామాయణంగా పరిణమించింది.



**ఏమిచ్చినా భగవంతుడే :** జీవితంలో సుఖం, దుఃఖం, లాభం నష్టం, వ్యక్తులు కలుసుకోవటం విడిపోవటం స్నేహము విరోధము చివరకు జనన మరణాలు అన్నీ భగవంతుని నిర్ణయాన్ని బట్టే ఉంటాయి. మన కర్మకు తగిన ఫలితాన్ని మనకు ఇస్తాడు దైవం. ఆ దైవాన్నే విధి అన్నారు పెద్దలు. విధి ప్రేరణను బట్టే మనకు ఊహలు ఏర్పడుతాయి. "బుద్ధిః కర్మానుసారిణి" అని పెద్దలు ఈ విషయాన్నే వివరించారు. కలిసివచ్చే రోజున మంచి ఆలోచన కలుగుతుంది. విధి, విపరీతమైనప్పుడు పెడ బుద్ధులు పుడతాయి. చెడు వైపుకు వడివడిగా అడుగులు పడతాయి. ఏదైనా ఇతరులు చేశారనుకోవటం భ్రాంతి. నేనే చేసాననుకోవటం వృథాభిమానము.

శ్లో॥ సుఖస్యదుఃఖస్య నకోపిదాతా పరోదదాతీతి కుబుద్ధి రేషా ।
ఆహంకరో మీతి వృథాభిమానః, స్వరసూత్రగ్రథితోహిజంతుః ॥

**లభించిన దానితోనే సంతోషించాలి :** లోకంలో ఉన్నవారంతా ఆశాజీవులే. ఆ, ఆశకు అంతంలేదు. ఎన్ని ఉన్నా, ఇంకా ఏదో లేదనే అసంతృప్తి మనిషిని వెంటాడుతూనే ఉంటుంది. అవకాశం ఉండి ఈ సమస్త భూమండలాన్నీ ఒకరికి వ్రాసి ఇస్తున్నామని ఎవరైనా ఇవ్వగలిగితే, ఆపైన ఉన్న ఆకాశమండలమో అని, అడగాలని అనిపిస్తుంది. అట్టి అత్యాశను నియంత్రించుకొని ప్రాప్తించినదానితో సంతోషించినవారే సర్వోన్నతులవుతారు. జలనిధి(సముద్రము) దగ్గఱకు వెళ్ళినా పాత్రకుమించి జలం లభించదనేది అనుభవంలో ఉన్న సత్యం.

భాగవతంలో, వామనావతార ఘట్టంలో బలిచక్రవర్తి, తనను అడిగినదేదైనా ఇస్తానని, వామనుని కోరుకొమ్మని చెప్పినప్పుడు ఆయన, నాకు, నేనడిగిన మూ డడుగుల మేర భూమి ఇస్తేచాలని, అదే నాపాలిటి బ్రహ్మాండమని వివరిస్తూ, ప్రాప్తమైన, లేశమైనను, పదివేలని తృప్తింజెందని మనుజుడు సప్తద్వీపములతో నైనను సంతోషించి, సుఖింపడని వర్ణించాడు.

వ్యాప్తింజెందక వగవక, ప్రాప్తంబగులేశమైన పదివేలనుచున్
తృప్తింజెందని మనుజుడు, సప్తద్వీపములనైన చక్కంబడునే ?

(భాగ: 8వ స్కం.)

సంసార విషవృక్షస్య, ద్వేఫలే అమృతోపమే।

కావ్యామృత రసాస్వాదః; సల్లాప స్సజ్జనైస్సహ॥

గంగ పాపమును, చంద్రుడు తాపమును, కల్పవృక్షము దైన్యమును పోగొట్టును. ఉదాత్తమైన ఆశయంగల మహాత్ములు పాపమును, తాపమును, దైన్యమును పరిహరించి, ఉత్తమమైన ధర్మ మార్గమును బోధిస్తారు.

సత్సంగం వలన మనసు వశమై, కామ, క్రోధాది వికారములకు దూరమై, ప్రసన్నతను పొంది, ప్రశాంతికి దారి తీస్తుంది. సజ్జనులను సందర్శించటం, వారి మాటలు వినటం, వారి సద్గుణములను కీర్తించటం, వారితో కలిసి జీవించటం, జీవులకు మేలు చేకూరుస్తుంది. పూలతో గూడిన దారానికి పరిమళ మబ్బినట్లు సజ్జనులతో గూడిన సామాన్యులకు కూడా, మాన్యత సిద్ధిస్తుంది.

కూచమ్మ కూడబెడితే, మాచమ్మ మాయం చేసింది అన్నట్లు ఒక తరం కష్టపడి సంపాదించి కూడబెట్టిన సంపదను తరువాతితరంవారు విచ్చలవిడి తనంతో విలువ తెలియక నీళ్ళలాగా ఖర్చుపెడుతుంటారు. అందువలన ముందుతరంవారు ఇప్పుడు ఆరాటపడి చేయగలిగింది ఏమీ లేదు. జీవితమంతా ఎంతగానో వెంపర్లాడిన ఆ పెద్దవారి కష్టం, తక్కిన వారికి ఎప్పుడు తక్కువే అనిపిస్తుంది. అయినా ప్రయత్నం చేయక తప్పదు. దానిని నిలబెట్టుకుంటే కాలానుగుణంగా వృద్ధి చెందుతుంది. జాతిగౌరవం నిలిపే భాష, సాహిత్యముల విషయము ఇంతే. ఉపేక్షాభావమే వినాశనానికి కారణం. పెద్దలమాట చద్దిమూట. గౌరవించి, అనుసరిస్తే, కడుపు చల్లబడుతుంది. అనుభవాన్ని, అభివృద్ధిని ఇస్తుంది.

శ్లో॥ అనంతశాస్త్రం, బహువేదితవ్యం, స్వల్పశ్చకాలో, బహవశ్చవిఘ్నాః ।

యత్సారభూతం తదుపాసితవ్యం, హంసోయథా క్షీర మివాంబురాశేః ॥

**అందటికీ అన్నీ తెలియవు, ఆ అవసరమూలేదు :** సర్వజ్ఞుడు దేవుడొక్కడే, ఎన్నో వేదములు, ఇంకెన్నో శాస్త్రములు, లోకంలో తెలియదగిన విషయములు మరెన్నో, కాలము స్వల్పము. విఘ్నములెక్కువ, హంస, పాలను స్వీకరించి, నీటిని విడిచినట్లు కావలసినంతవఱకు, సారభూతమైన దానిని (ధర్మమును) తెలుసుకొనేందుకు మనము ప్రయత్నించాలి. తెలిసిన దానిని ఆచరించాలి. అదే జీవితానికి అర్థము. విద్యకు పరమార్థము.



పూజ్యుడైన వ్యాస మహర్షి భారతం, భాగవతంతోబాటు అష్టాదశ పురాణములు, ఉప పురాణములు, బ్రహ్మ సూత్రములు మొదలైన విషయములెన్నో సరళము, మధురమైన తనమాటలలో ఈ లోకానికి విశదీకరించాడు. అందులో భారతం పంచమ వేదంగా ప్రసిద్ధి కెక్కింది. కాళిదాసాది మహాకవులెందఱో కావ్యాలు, నాటకాలు రచించి మాటలలోని మాధుర్యాన్ని, రసానందాన్ని అనుభవింపజేశారు.

ప్రాంతీయ భాషా కవులు, సంస్కృతంలో ఉన్న ఆ వాగమృతాన్ని తామనుభవించి తమ వారికి పంచి ఇచ్చారు. జాతికి, సంస్కృతికి ఎనలేని సేవ చేశారు. ఇట్టి వాఙ్మయ ప్రపంచమంతా మాటల వలననే ఏర్పడింది.

**మాట విలువ:**

ప్రతి శబ్దానికి ఒక శక్తి ఉంటుంది. ఆ శబ్దశక్తి మీదనే ఆధారపడి లోక వ్యవహారమంతా నడుస్తుంది. తన ఒడిలో ఉన్న శిశువుకు తల్లి ఉగ్గు పాలతోనే నేర్పేదిమాట. బడిలో చేరిన విద్యార్థికి గురువు బోధించేది మాట, మంచి, చెడులను వివరించి, ప్రోత్సహించే మిత్రులు సూచించేది మాట, ప్రేమకు, ద్వేషానికి మూలమైనది మాట. ఇరుగు, పొరుగువారితో స్నేహమైనా, విరోధమైనా మాటవలననే ఏర్పడుతుంది. వ్యాపారరంగంలో ఇచ్చిపుచ్చుకోవటం మాటవలననే సాధ్యపడుతుంది. విశ్వాసానికి కారణ'మైనది మాట కావటంచేత, నిత్య జీవితంలో మాటకెంతో ప్రాధాన్యం ఉంది.

**మనసు తెలిపేది మాట – మనసు కోరేది మాట:**

మనసులో ఉన్న భావం తెలియజేసేందుకు ఉపయోగించేది మాట. సంతోషకరమైన (వార్త) విషయం ఏదైనా, తనకు ఇష్టమైన వారితో చెప్పుకొని పంచుకొని సంతృప్తిపడడం, కలిగిన దుఃఖాన్ని ఆత్మీయులైన వారికి వివరించి, వారి ఓదార్పు పొందంటం మాటవలననే సాధ్యపడుతుంది. తన మంచితనాన్ని, తన సామర్థ్యాన్ని మెచ్చుకొనే అభిమానుల మాట కొఱకు పరితపించటం, కళలను ఉపాసించేవారు అందుకు విశేషంగా పాటు పడటం జరుగుతుంది. లోకంలో అభిమాన సంఘుల ఆవిర్భావానికి ఇదే కారణం.

**మాటకు సత్యమే ప్రాణము:** **" సత్యం కంఠస్యభూషణం "**

మాట మీద నిలబడే మనిషిని ప్రజలు గౌరవిస్తారు. దేవుడని కీర్తిస్తారు. మనసు, మాట, మనుగడ (ఆచరణ) ఒకటిగా ఉండటం వలన మానవులు మహాత్ములని కీర్తింపబడతారు. దురాత్ములకది ఆచరణ సాధ్యంకాదు. వారి మనస్సుకు మాటకు చేతకు పొంతన కుదరదు.

మనదేశ స్వాతంత్రోద్యమ రథసారథియైన గాంధీగారు, సత్య వ్రతం పాటించటం వలననే 'మహాత్ముడ'య్యాడు. నిరంతరం రామనామాన్ని జపించటంద్వారా ఆయనవాక్కు పవిత్రమైంది. మంత్ర పూతమైన ఆయన మాట దేశ ప్రజలనందఱిని ఒకే త్రాటిమీద నడిపించింది. భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించింది. మాతృభూమి దాస్యశృంఖలాలను త్రెంచి, స్వేచ్ఛా వాయువులను, ప్రగతి పథంలో కాంతి కిరణాలను ప్రసరింప చేసింది. సత్య, ప్రియ భాషియైన వానికి జగమే వశమవుతుందనటానికిది యొక ఉదాహరణము. భాగవతంలో వామనావతారంతో తనను మూడడుగులు యాచింప వచ్చినవాడు శ్రీమహావిష్ణువని, అతని వలన తనకు ప్రమాదం సంభవిస్తుందని తెలిసికూడా బలిచక్రవర్తి తానిచ్చిన మాట కాదనటం ఇష్టంలేక తన గురువు శుక్రాచార్యునితో 'నిరయంబైన, నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన కానిమ్ము' దేవా! 'తిరుగన్ నేరదునాదు జిహ్వ, వినుమా ధీవర్య వేయేటికిన్' అని చెప్పి, మాట తిరుగలేరు మానధనులు' అని నిరూపించాడు. లోకంలో యాచకులకు గౌరవం లేదు. అయితే 'పరులహితంకోరి యాచించటం దోషంకాదని, అట్టి సత్పురుషులకది అవమానంకాదు అలంకారమేఅని పోతన విశేషంగా అభివర్ణించాడు. "పరహితరతమతి యుతులగు, దొరలకు, నడుగుటలునొడలి తొడవులు పుడమిన్".

**సత్య,ధర్మములను ప్రతిష్ఠించేది వాక్కు :** 'క్రతు శతమునకన్న, సుత శతకంబునకన్న, ఒక్క సూనృత వాక్యమే, మేలని భారతంలో శకుంతల దుష్యంతుని ఎదుట ప్రకటించింది. తీర్థసేవనము, వేదాధ్యయనము సత్యముతో సమము కావని, సత్యమే ధర్మములలోకెల్ల శ్రేష్ఠమనే పెద్దల నిర్ణయాన్ని వివరించింది. హరిశ్చంద్రుడు మాటకు కట్టుబడి ఉండటం చేతనే సత్యహరిశ్చంద్రుడని దేవతలచేత కూడా ప్రశంసింపబడ్డాడు. లోకంలో వేరెవరికీ ఇట్టి కీర్తి దక్కలేదు.



**నీటి కొద్ది తామర :** కొలనులో తామరలు నీటి లోతును బట్టి, పెరుగుతూ, తరుగుతూ ఎక్కడికక్కడే పూలు పూస్తాయి. వాసనలు వెదజల్లుతాయి. అదే విధంగా ఆయా జీవుల సంస్కారాన్ని బట్టి, ఆలోచనా పరంపర ఏర్పడుతుంది. విద్యాగంధ మబ్బుతుంది. వాగర్థములు బోధపడతాయి. లోకంలో అందఱు ఒకేరకంగా ఉండరు. తెలివి ఒకరి సొమ్మేమీ కాదు. 'ముఖే ముఖే సరస్వతి' అన్నట్లు ఎవరి జ్ఞానం వారిది. సజ్జనులైన వారందఱి మాట పాటింపదగినదే. అవసరం, అవకాశం గమనిస్తూ వివేకంతో ముందుకు సాగిపోవాలి. నమ్మి చెడినవాడు లేడు. లోకంలో వారివారి పాత్రతలను, యోగ్యతలనుబట్టి అవి వినియోగింపబడతాయి. వాగధి దేవతయైన సరస్వతి అనుగ్రహం ఒక సుధా సముద్రం. అందులో ఆ, యా పాత్రలకు తగిన విజ్ఞానం వారికి లభిస్తుంది.

చైతన్య రూపంలో అంతటా నిండి ఉన్న ఆ సచ్చిదానంద రూపమును గుర్తించి, అందుకొని అనుభవించటమే కర్తవ్యము. అక్కడ ఈ మాటలకు చోటు లేదు. మనసునకది అందదు. 'యతో వాచోనివర్తంతే అప్రాప్య మనసాసహ' అన్న శ్రుతి వాక్యమే అందుకు ప్రమాణము. ఆ బ్రహ్మతత్త్వమును తెలుసుకొనుటకు సత్సాంగత్యమే శరణ్యము. ప్రతి ఒక్కరు కవిత్వం చెప్పనవసరంలేదు. వ్రాయకపోవటం నేరమేమీ కాదు. అయితే కుకవిత్వము నరకమునకు హేతువు. అట్టిది చెప్పకుండా ఉంటేనే మేలు. ఆ సత్యమును వర్ణించుటకు కవిత్వమునకు శక్తి చాలదు. కావుననే ధూర్జటి ఆ విషయమును చక్కగా ప్రకటించాడు.

ఏ లీలన్ నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షా ధ్వని వ్యంగ శ
బ్దాలంకార విశేష భాషల కలభ్యంబైన నీ రూపమున్
చాలుం జాలు కవిత్వమున్ నిలుచునే సత్యంబు వర్ణించుచో;
ఛీ, లజ్జింపరుగాక, మాదృశ కవుల్ శ్రీకాళహస్తీశ్వరా !

ఈ సంసార విష వృక్షమునకు రెండే రెండు అమృతంతో సమానమైన ఫలములు 1) కావ్యామృతరసా స్వాదము 2) సజ్జన సల్లాపము. వీని వలన జీవులు ఆనందమూర్తులై, సన్మార్గవర్తనులై పరమార్థతత్త్వమును తెలుసుకొన గలుగుచున్నారు.

అలవడ్డాయని బోధించటం ఆ వర్ణనలలోని పరమార్ధము. ఆదిశంకరుల వారికి ప్రజలు 'ఏ ఇంటి ముందు చిలుకలు వేద వేదాంగములు గానం చేస్తాయో. అది మండన మిశ్రుని గృహమని గుర్తు చెప్పి పంపారట. అది అతని పాండిత్యమునకు చిహ్నము.

**కవిత్వమొక ఆరాధనా విశేషము :** నన్నయ్య, తిక్కనాది కవులు కొందరు తమ కవిత్వ రచనాదులను ఆరాధానా విశేషంగా భావించి, తమ ఇష్ట దైవములకు వాచికార్చనలు సమర్పించి, వారి అనుగ్రహానికి పాత్రులైనారు. కారణ జన్ములు, తపోనిష్ఠా గరిష్ఠులు అయిన శంకరాచార్యుల వారు ప్రస్థానత్రయాన్ని వ్యాఖ్యానించటంతోబాటు స్తోత్ర వాఙ్మయాన్ని సృజించి మంత్రపూతమైన తమ వాక్కుల ద్వారా సామాన్య ప్రజానీకానికి బ్రహ్మతత్త్వాన్ని అందుబాటులోకి తెచ్చారు. భగవంతుని అనంతత్వాన్ని వాఙ్మయ దర్పణంలో సుందరంగా దర్శింపజేశారు.

మతమేదైనా, మార్గం ఏదైనా ఆనందానుభవం అందఱికి ఒకే విధంగా ఉంటుంది. ఆనందమే బ్రహ్మమునది శ్రుతి వాక్యము 'ఆనందో బ్రహ్మ'. అందువల్ల బ్రహ్మానుభవం కూడా అంతే. అయినప్పటికి, దాని వ్యక్తం చేసేవారి మాటలలో తేడా ఏర్పడి వివిధ మతాల పేరుతో ప్రపంచంలో ప్రసిద్ధి కెక్కాయి. మతం అంటే అభి ప్రాయమనే అర్ధము. ఎవరి అభిప్రాయం వారికి గొప్పదిగా తోస్తుంది. అందుకు ఇతరులను నిందింపనవసరములేదు. ఇందులో సిగపట్లు పట్టుకొని, వివాదపడవలసినదేమీ లేదు. ఎవరి పరిధిలో వారుంటే మంచిది.

'బ్రహమొక్కటే' అయినప్పటికి ఆ విషయాన్ని పలువురు పలురకాలుగా వెల్లడించటంలో వైవిధ్యం ఏర్పడింది. వస్తు దృష్ట్యా సృష్టి ధర్మమే వైవిధ్యం కావటంచేత ఆ భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించుటకే బ్రహ్మమును మనకు ప్రసాదించారు. ఆ వాస్తవాన్ని గుర్తించి వాక్కును ఉపాసించినవారు, ధన్యులవుతారు. భవబంధ విముక్తులవుతారు. ఈ వాక్కు పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనే పేర్లతో నాలుగు విధాలుగా ఉంటుంది. అంతర్ముఖులై సమాధి నిష్ఠులైన యోగులకది అనుభవ గమ్యమైన విషయము. మాట్లాడే వారికి నోటి మాటగా వెడువడే ఆ శక్తి, మౌనులకు ఆత్మశక్తిగా ఆధ్యాత్మ జ్యోతిగా దర్శనమిస్తుంది.



**ఆడితప్పితే అపనింద వస్తుంది, చేసిన పుణ్యం కాస్తా పోతుంది :**

రామాయణంలో దశరథడు తనసభకు వచ్చిన విశ్వామిత్రునకు 'ఏది కావాలంటే అది ఇస్తానని మొదటమాట ఇచ్చాడు. అతడు యాగ సంరక్షణకు రాముని పంపమని అడిగితే దశరథుడు పుత్రుని యెడగల మమకారంతో కాదు, కూడదని నిరాకరించాడు. విశ్వామిత్రునకు కోపం వచ్చింది. వశిష్ఠుడు ఆ సందర్భంలో 'అబద్ధమాడటం వలన అపనిందల పాలగుటయేకాక ఇహపర సుఖములకు కూడా భంగం ఏర్పడుతుందని చెప్పి, రాముని, ఆ ముని వెంట పంపమని దశరథునకు ధర్మాన్ని ఉద్బోధించాడు. ఇష్టము అంటే యజ్ఞయాగాది క్రతు నిర్వహణము, పూర్తములు అంటే వాపీ, కూప, తటాకాది నిర్మాణములు మొదలైనవి. మాట తప్పిన వారికి పై వాని వలన కలిగే ఫలితం ఉండదు. అందువలననే 'సత్యంవద' అని వేదం ఆదేశించింది.

ఉపశ్రుత్యకరిష్యేతి ఉక్తంవాక్యమకుర్వతః !

ఇష్టాపూర్తవథో భూయాత్, తస్మాద్రామం విసర్జయ !! వా.రా; బా.కాం.

**సత్యమును పాటించినవాడే లోకంలో పురుషోత్తముడు :** వేమన 'పురుషులలో పుణ్యపురుషులని' వీరినే ప్రశంసించాడు. పాండవులు అన్నమాటకు జవదాటని వారు కనుకనే ధర్మాత్ములని కీర్తింపడ్డారు. మంచిమాట మనసును తేటపఱచి, పాపపు పనుల నుండి నివారిస్తుంది. మేలు కలుగజేస్తుంది. కర్తవ్యాన్ని సూచిస్తుంది. అందువల్ల అటువంటి ఉత్తమ సారస్వతాన్ని అభ్యసించటం ద్వారా అజ్ఞానపు చీకట్లు పటాపంచలయిపోతాయి. అందుకు మనం ప్రయత్నించాలి.

**పెళ్ళినాటి ప్రమాణాలు :** ప్రకృతి, పురుషుల కలయిక వలన సృష్టి ఏర్పడుతుంది. మానవ సమాజంలో అది భవ్యమైన వివాహ వ్యవస్థగా ప్రసిద్ధికెక్కింది. భారతీయ సంస్కృతిలో ఈ వైవాహిక బంధానికి మిక్కిలి ప్రాముఖ్యత ఉంది. ఋషులు ధర్మబద్ధమైన అర్ధ, కామములను అనుభవించడం ద్వారా మోక్షమును పొందటం, పురుషార్థ చతుష్టయ సాధనంగా వర్ణించారు. ఇహపర సుఖములకది శ్రేయోమార్గంగా గుర్తించారు. వివాహ సమయంలో వరునిచేత 'ఈమెను అతిక్రమించి తాను ఏ విషయంలోను, ఎప్పుడు వేరుగా ప్రవర్తించ'నని ప్రతిజ్ఞ

చేయించి అతనికి కన్యనిచ్చి పెళ్ళి చేయటం పరిపాటి. 'ధర్మేచ, అర్థేచ, కామేచ నాతి చరితవ్యా' అని చెప్పిన పెద్దల మాటకు సమాధానంగా 'నాతిచరామి' అని వరుడు ప్రతిజ్ఞ చేయటం వివాహ విధిలో తెలియదగిన విశేషం. ఇరువురికి ఈ నియమావళి వర్తిస్తుంది. సాంఘిక నియమమైన ఈ వివాహ పద్ధతిలో న్యాయము, భద్రత ఇమిడి ఉన్నాయి. వధూవరులు వారి పెళ్ళినాటి ప్రమాణాలు నిలబెట్టుకొన్నప్పుడు అది ఆనందాన్ని చేకూరుస్తుంది. ఆదర్శ దాంపత్యం అవుతుంది. పశుపక్ష్యాదులకులేని ఈ విశిష్టత మానవజాతికి జీవన సమగ్రతను, జన్మసాఫల్యాన్ని చేకూర్చింది.

**మాట వలన మన్నన కలుగుతుంది :** మాట విలువ తెలిసి పలికినప్పుడు మనిషి మహర్షి అవుతాడు. అతనిమాట మంత్రమై ప్రపంచానికి రాచబాటగా పరిణమిస్తుంది. అతడు మన్ననకు పాత్రుడవుతాడు. వివేకానందుడు ప్రపంచ సర్వమత మహాసభలో తన వాక్ వైభవంతో మన దేశానికి, జాతికి, సంస్కృతికి ఎనలేని ఖ్యాతినార్జించి పెట్టాడు. తాను జత్రుష్టి గడించాడు.

**మనుషులుందరు – మాటలుంటాయి :** మనం అనేక సందర్భాలలో ఫలానావారు (తల్లి, తండ్రి, గురువు...) ఇలా అన్నారని, వారు భౌతికంగా లేకపోయినా, వారి మాటలు ఉదహరించుకొంటూ ఉంటాము. ఈనాడు మనకు లభించే సూక్తులు, సామెతలు మన పెద్దలు మనకు అందించిన అనుభవసారమే అని గ్రహించగలం. అవి సుభాషిత రత్న భాండాగారము'లవంటి గ్రంథములలో భద్రపరుపబడి తరతరాలవారికి బ్రతుకుతెరువు (బాట)ను సూచిస్తూ ఉంటాయి. ఆ బాటలో పయనించిన వారికి మంచి ఫలితాలను అందిస్తూ ఉంటాయి.

**మంచి – చెడు :** మానవులయొక్క మంచి, చెడులు వారి మనసును తెలియజేసే మాటల మీదనే ఆధారపడుతు ఉంటాయి. ఒక సినిమా హిట్ అయినా, ఫ్లాప్ అయినా, ప్రజల టాక్ వలనే అవుతుందనేది నిత్యం అనుభవంలోవున్న విషయమే. ఒకరు మఱియొకరిని భూషించినా, దూషించినా అది వాక్కు వలననే కదా జరిగేది. రూపం ఒకటిగా ఉన్నా వసంతకాలం వచ్చినప్పుడే కాకికి, కోకిలకు భేదం బోధపడినట్లు, మంచికి, చెడుకు, భేదం తెలిసేది సమయం వచ్చి వారు నోరు తెఱిచినప్పుడే కదా!



అర్థములను ఇచ్చే సామర్థ్యం కలిగి ఉండటం వలన, ద్వంద్వార్థాలు వచ్చే ఈనాటి సినిమా పాటలు, మాటలు సాధ్యపడుతున్నాయి. కొందఱు కవులు ఈ శబ్ద శక్తిని ఆధారంగా చేసుకొని కడవఱకు కూడా రెండర్థాలు వచ్చే కావ్యాలు వ్రాశారు. రాఘవ పాండవీయము ఇందులో రామయణకథ, భారత కథ రెండు కలిపి ఏకముఖంగా వర్ణింపబడ్డాయి.(కవి పింగళి సూరన్న)

**ఇట్టిదే హరిశ్చంద్ర నలోపాఖ్యానము :** ఇందులో హరిశ్చంద్రుని కథ, నల మహారాజు కథ జోడించి చెప్పబడ్డాయి. (కవి రామరాజభూషణుడు) మఱికొందఱు 3,4 అర్థాలువచ్చే విధంగా కూడా కావ్యాలు వ్రాశారు. శోకము, క్రోధము, ఆశ్చర్యము మొదలైన భావముల ప్రభావంవల్ల స్వరములో కలిగే మార్పును కాకువు అంటారు. ఈ కాకుస్వరప్రయోగం ద్వారా కూడా వ్యంగ్యం సాధింపబడుతుంది. 'వాడు నీ వయసు వాడే, నీలాగానే ప్రవర్తిస్తున్నాడా? అంటంలో 'వాడు నీ కంటే బుద్ధిగా, బాధ్యతగా ఉంటున్నాడని, 'వాడు నీ తరగతే చదువుతున్నాడు, మార్కులు నీలాగే వస్తున్నాయా? అంటే వాడికి ఎక్కువ (తక్కువ) వస్తున్నాయనే వ్యంగ్యం సూచితమవుతుంది. కాతాదారునిగూర్చి అంగడి యాజమాని 'అయన కనబడటం లేదు. ఒకసారి కనబడి పొమ్మని చెప్పండి.' అంటే బాకీ తెచ్చి కట్టమనే హెచ్చరిక ధ్వనిస్తుంది.

**ఏగూటి చిలుక ఆపలుకే పలుకుతుంది :** పిల్లలు తాము పుట్టి పెరిగిన వాతావరణాన్ని బట్టి, పెద్దలు మాట్లాడే తీరును అనుసరించి, ఆ, యా వృత్తులకు సంబంధించిన విషయాలే ఎప్పుడు వింటూ, గమనిస్తూ ఉండటం వలన, ఎక్కువగా అవే మాటలు ప్రస్తావిస్తూ ఉంటారు.

పూర్వం ఋషుల ఆశ్రమాలలో, గురుకులములలో విద్యాబోధన జరుగుతూ ఉండేది. అక్కడ ఉన్న శుక, శారికాది పక్షులు సహితం ఆ గురువులు చెప్పే విద్యలర్థం చేసుకొని, గురువుల పరోక్షంలో చదివే విద్యార్థుల పాఠాలలోని తప్పులు సరిచేసేవని గ్రంథాలలో వర్ణించారు. అచట జంతువులుకూడా సహజమైన జాతివైరం మఱచి స్నేహంగా ఉండేవట. ఋషుల సమదర్శనం వలన, అచటి మృగములకు కూడా సాన్నిధ్య మహిమవల్ల ఆ సహనము సహజీవన విధానము

కావ్యమని సాహిత్య విమర్శకులు పేర్కొన్నారు. వస్తు, అలంకార, రసభేదములతో వ్యంగ్యము మూడు రకాలు. ఇందులో రసధ్వని శ్రేష్ఠమైంది. విధి ద్వారా నిషేధమును, నిషేధము ద్వారా విధిని తెలియజేసే ఈ ధ్వని స్వరూపము చాలా విశేషము, విశిష్టము అని వర్ణింపబడింది. మాటలలోని మెఱుగులు చూపించి, చురకలు తగిలించి, సరసతను కలిగించి, సంభాషణకు వన్నెతెచ్చే, మాన్యత చేకూర్చే శక్తి ధ్వనికి సహజము. కావ్యంలో అదే సౌందర్యము.

భారతంలో పాండవులవద్దకు రాయబారిగా వచ్చిన సంజయుడు ముందుగా, ధృతరాష్ట్రుడు వారి క్షేమమును అడిగినట్లు చెప్పాడు. అది విని ధర్మజుడు", ఆ రాజు మాదెసంగల కారుణ్యము కతమున నిట్లున్నారము' అని సమాధానం చెప్పాడు. ఇందులో 'ఆయన దయవల్ల మేము క్షేమంగా ఉన్నామనే వాచ్యార్థముతోబాటు, 'మా యెడ అతనికిగల ఉపేక్షా భావంవల్ల, ఆయన, తనయులు ఇన్ని దురాగతాలకు పాల్పడ్డారు. ఆ కారణంగా అడవులలో మేమెన్నో ఇడుములు పడ్డాం. ఆయనకు గల పుత్ర వ్యామోహం వలననే ఇన్ని అనర్థాలు సంభవించాయి'. అన్న విశేషార్థము ధ్వనిగా బోధపడుతుంది. ఈ విధంగా శబ్ద శక్తి వినియోగింపబడటం ఆ యా సందర్భములను బట్టి, మాట్లాడే వ్యక్తుల శక్తి సామర్థ్యములను బట్టి సాధ్యపడుతుంది. మహాకవుల మాటలలో ఇట్టి విశేషములు అలవోకగా చోటుచేసుకొంటాయి.

**భాషలో తమాషాలు :** కొన్ని పదములు ఒక చోటికి విరిస్తే ఒక అర్థం వేరొక చోటికి విరిస్తే మరొక అర్థం ఇస్తాయి. 'కవితలలో, లేనిది ఏమున్నది' అన్న వాక్యాన్ని కవి, తలలోలేనిది ఏమున్నది అని విఱిచి చదివినప్పుడు తమాషగా ఉంటుంది. విశేషార్థం గోచరిస్తుంది. నేరం నాది కాదు, ఆకలిది – నేరం నాది, కాదాకలిది మొదలైనవి. ఇట్టివే కొన్ని పదాలు వానికిగల నానార్థాలను ఆధారంగా చేసుకొని ఏ విధమైన పదవి భాగం చేయకుండానే వానిలో చమత్కారం సాధింపబడుతుంది. 'జవదాటరు పాండవులన్న మాటకున్' అన్న వాక్యంలో 'అన్న మాటకున్' అనే పదము 'వారు అనిన మాటకు' అన్నగారనిన మాటకు, కట్టుబడి ఉంటారనేభావం అభంగశ్లేష వలన సిద్ధించింది. కొన్ని పదములు రెండు



**మాట్లాడటం ఒక కళ :** ఎదుటివారు మెచ్చుకొనేలాగా చక్కగా మాట్లాడటం ఒక కళగా పరిగణించారు పెద్దలు. అందులో నిపుణులైన వారిని గొప్ప వక్తలని అభినందించారు. మతబోధకులను, ధర్మప్రచారకులను ప్రవక్తలని అభివర్ణించారు.

**ఆత్మ సంస్కారాన్ని తెలియజేసేది మాట :** చెట్టుయొక్క సారం పండులో గోచరించినట్లు,మనిషియొక్క సంస్కారం మాటలో ప్రతిఫలిస్తుంది. రామాయణంలో రామ సుగ్రీవులకు మైత్రి కూర్చినవాడు హనుమంతుడు. సీతాన్వేషణకై ఋశ్యమూక పర్వత ప్రాంతంలో సంచరిస్తున్న రామ లక్ష్మణులను చూచి, సమీపించి హనుమంతుడు సంభాషించిన తీరు వారి హృదయాలకు ఆహ్లాదాన్ని కలిగించింది. సంస్కారాన్ని తెలియజేసే ఆమాటలకు రాముడు సంతోషించి 'తొందరపడడం, అతిగా నాన్చటం అనే వాక్ దోషాలులేని ఇతడు సంస్కార సంపన్నములు, శుభకరములు, మనోహరములు అయిన మాటలు మాట్లాడుతున్నాడ'ని హనుమంతుని ఎంతగానో అభినందించాడు. చెప్పేటప్పుడు విషయంతోబాటు, విధానానికి కూడా తప్పక విలువ ఉంటుంది. హనుమంతుని గుణగణాలను వర్ణిస్తూ కవులు అతని వాక్ పటుత్వాన్ని విశేషంగా కీర్తించారు. ఆయనను స్మరిస్తే మనకూ వాక్ – నిపుణత సిద్ధిస్తుందని సూచించారు. ఎవరి దగ్గఱ ఏ విశేషం ఉంటే లోకమది అడగటం, వా రది ఇవ్వటం సహజం. అందువల్ల నేను విఘ్నపతియైన వినాయకుని ఏమీ కోరను. దేనికీ అడ్డు పడవద్దని మాత్రం నమస్కారం చేస్తానని అంటాడు ఒక చమత్కారి భక్తుడు.

**మాటకొక మహత్తర శక్తి ఉంది :** మానవుని హృదయాన్ని ఆవిష్కరించేది మాట. అది సంస్కారయుక్తమై ఉన్నప్పుడు గౌరవ – ఆదరములు లభిస్తాయి. తీరుతెన్నులులేని మాట సభలో అపహాస్యంపాలు చేస్తుంది. ఒకొక్కసారి అది ప్రాణాంతకం కూడా అవుతుంది. కొద్ది మాటలలోనే తన విద్యా వైదుష్యములు ప్రకటితమయ్యే విధంగా మాట్లాడినవాడు హనుమంతుడు. అంతలోనే అతని శక్తి, సామర్థ్యములు గుర్తించిన పరేంగిత జ్ఞాన సంపన్నుడు రాముడు. "భావగ్రాహీజనార్దనః" అని పెద్దలనటంలోగల పరమార్థమిదేనేమో.

**సమయజ్ఞత కావాలి :** సమయోచితంగా, సూటిగా విషయాన్ని ప్రకటించడంలోను

హనుమంతుడు సిద్ధ హస్తుడు. లంకలో సీతను చూచి తిరిగి వస్తున్న హనుమంతుడు సముద్రతీరాన ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని తనరాకకై ఎదురు తెన్నులు చూస్తున్న వానర బృందానికి, హృదయావేదన తీరే విధంగా తాను సీతను చూచిన సంగతి 'దృష్టామయా సీతా' అని వెంటనే వెల్లడించి తన సమయజ్ఞతను ప్రదర్శించాడు.

**మాట మనుగడకు దోహదం చేస్తుంది :**

చరిత్రలో, వాఙ్మయ చరిత్రలో ప్రసిద్ధుడైన తిక్కన, తన వాక్చతురతతో కాకతి గణపతి చక్రవర్తిని మెప్పించి అతని సహాయంతో తన ప్రభువు మనుమసిద్ధిని దాయాదుల దురాగతముల నుండి రక్షించి, రాజసింహాసనంపై పునఃప్రతిష్ఠితుని చేశాడు. నిజ జీవితంలో అతడు విలువైన ఇట్టి రాయబారాన్ని సమర్ధవంతంగా నిర్వహించినవాడు కనుకనే భారత రచనలో రాయబార ఘట్టాలను రసవత్తరంగా వర్ణించి అభినందనీయుడు, కవి బృందవంద్యుడు అయినాడు.

**మధుర భాషణం వలన మర్యాద లభిస్తుంది:** అది ఒక సుకృత విశేషంగానే భావించాలి. వినుగుపుట్టే విధంగా అతిగా మాట్లాడేవారిని లోకం మన్నించదుసరికదా, కసరి కొడుతుంది. 'కోకిలమ్మ చేసుకొన్న పుణ్యంబేమి, కాకి చేసుకొన్న కర్మమేమి ? మధుర భాషణమున మర్యాద ప్రాప్తించు, లలిత సుగుణజాల, తెలుగుబాల,' (కరుణశ్రీ).

**ఒకటి తక్కువ, రెండెక్కువ :** లోకంలో మాటకున్నంత విలువ మఱి దేనికి లేదు. అది తెలుసుకొని జాగ్రత్తగా మాట్లాడటం నేర్చుకోవాలి. ఎక్కువ మాట్లాడితే వాచాలుడంటారు. మాట్లాడకపోతే మూగ వాడంటారు. అందువల్ల అచి తూచి తగిన విధంగా మాట్లాడాలి. అనవసరంగాను, అనుచితంగాను పలుకరాదు. అట్టి నియమం వలన నిరర్థకములయిన మాటలు సంభాషణము నుండి నివారింపబడతాయి. 'ఎవరి దగ్గఱ, ఎప్పుడు, ఎంతవరకు మాట్లాడాలో లోకంలో అందఱు అభ్యసింపదగిన విద్య' అని, "నొప్పింపక, తానొవ్వక తప్పించుకు తిరిగువాడు ధన్యుడని" కీర్తించాడు బద్దెన. పళ్ళ మధ్య నుండి తప్పించుకొంటూనే, రసాస్వాదన చేస్తూ చెప్పదలచు కొన్నది చెప్పగల తలలోని నాల్కవలె యుక్తి యుక్తము సందర్భ సుందరము అయిన పలుకు పలుకుట శ్రేయోమార్గమని కవి



అయిన, కొన్ని పదములు ప్రతీకాత్మకములై చమత్కారజనకములుగా భాసించటం భాషా సౌందర్యమును వెలయింప జేస్తాయి. వీనిలో పొడుపు కథలు అందఱి హృదయములను ఆకర్షించుచు విశేషమైన ఆదరాన్ని పొంది ఉన్నాయి. తల్లి గర గర, తండ్రి పీచు పీచు, బిడ్డలు రత్న మాణిక్యాలు అంటే మొక్క జొన్న కండెలు అని ' కిటకిట తలుపులు, కిటారి తలుపులు ఎప్పుడు మూసినా చప్పుడు కావు' అంటే కనురెప్పలు అని చెప్పినప్పుడు హృదయం ఆనందంతో చిందులు వేస్తుంది. ఇందులోనే శాస్త్ర విషయాలు, మంత్ర రహస్యాలు, వైద్య విధానాలు, శబ్ద–అర్థ–అలంకార సంపదలు చోటు చేసుకొన్నాయి. ఒక విషయం ప్రస్తావనకు వచ్చినప్పుడు అది ఇష్టం లేనిదైతే తర్వాత చూద్దాంలే అంటారు. ఈ అనంతర శబ్దం నాస్తి (లేదు) అనే పదానికి పర్యాయంగా వాడటం. ఒక ప్రయోగ వైచిత్రి 'శేషం కోపేన పూరయేత్' అన్నట్లు కొందరు సమాధానం చెప్పలేనప్పుడు కోపాన్ని ప్రదర్శిస్తారు. అది ఒక వింత ధోరణి.

**శబ్ద శక్తి మహిమ :** శబ్దానికి 1) వాచ్యము 2) లక్ష్యము 3) వ్యంగ్యము అని మూడు అర్థాలు ఉంటాయి. సమయము, సందర్భము, కాలము' దేశము పాత్రలు మొదలైన అనేక విషయములు అందుకు సహకరిస్తాయి.

ప్రకృతార్థాన్ని మాత్రమే చెప్పేది వాచ్యము. విద్యార్థి పాఠములు చదువుచున్నాడు. భక్తులు దేవాలయమునకు పోవుచున్నారు. కేవల విషయ బోధకములైన ఈ వాక్యములలో విశేషములేదు. 'గంగలో గొల్ల పల్లె ఉంది' అన్న వాక్యంలో ప్రవాహం మధ్యలో పల్లె ఉండటం సాధ్యం కాదు కనుక, గంగ ఒడ్డునే అని అన్వయం (అర్థం) చెప్పుకోవాలి. ఇదే లక్ష్యార్థము – దీని వలన ఆ పల్లె గంగకు బాగా దగ్గఱగా ఉన్నదని బోధపడుతుంది. అలా చెప్పటం వలన ఆ ప్రదేశంయొక్క పవిత్రత, అచ్చటగల చల్లదనము మొదలైన విశేషములు తెలియజేయటం ప్రయోజనం.

శబ్దమునకు, ప్రస్తుత సందర్భమునకు తగిన అర్థముతోబాటు రమణీయమై, మనోహరమైన వేఱొక అర్థము కూడా కుదిరినచో, అది వ్యంగ్యము. దీనినే సాహిత్య వేత్తలు ధ్వని అంటారు. ధ్వని ప్రధానంగాగల కావ్యం ఉత్తమ

**ప్రవృత్తినిబట్టి మాటలు బోధపడతాయి :** లోకంలో' ఒకే మాట పలువురికి పలు విధాలుగా అర్థమవుతుంది. 'సూర్యడస్తమిస్తున్నాడు' అనంగానే చీకటి పడుతుంది, దీపం వెలిగించాల'ని, గృహిణికి కర్తవ్యం గుర్తుకు వస్తుంది. గోపాలునికి గోవులను ఇంటికి తోలుకువెళ్ళాలని తెలుస్తుంది. అలాగే తక్కిన వారికి తమతమ విషయములు బోధపడతాయి. పూర్వం, దేవతలు, రాక్షసులు, మానవులు భగవంతుడైన ప్రజాపతిని గూర్చి తపస్సు చేసారు. ఆయన ప్రత్యక్ష మయ్యాడు. అప్పుడు వారు తమకేదైనా ఉపదేశింపమని కోరారు. భగవంతుడు'ద' అన్న అక్షరం ఉచ్చరించి, ఇదే నేను మీకుచేసే ఉపదేశమని చెప్పాడు. సంస్కారాన్ని బట్టి ఆ అక్షరం ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా బోధపడింది. అందులో ఇంద్రియ లోలుపులైన దేవతలకు 'ద' అంటే 'దమ్యత' అని స్ఫురించి 'మీరుసంయమనం పాటించండి' అనే భావంతోచింది. లోభగుణం గలిగిన మానవులకు 'ద' అంటే 'దత్త' అన్నది గుర్తుకువచ్చి, 'మీరు దానం చెయ్యండి' అనే విషయం అవగాహనకు వచ్చింది. క్రూరస్వభావులైన రాక్షసులకు 'ద' అంటే 'దయధ్వం' అన్న పదం మనసుకుతోచి 'మీరు దయగలిగి మెలగండ'నే అర్థం బోధపడింది. (బృహదారణ్యకోపనిషత్‌లో ఈ కథ చెప్పబడింది)

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, ఈ మూడు గ్రంథములను ప్రస్థానత్రయం అంటారు. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతములను త్రిమతములని పేర్కొంటారు. పై గ్రంథములకు ఆ, యా మత ప్రవర్తకులైన పెద్దలు త్రిమతాచార్యులు తమ, తమ ఆలోచనలకు అనుగుణమైన అభిప్రాయాలు (భాష్యాలు) ప్రకటించారు. వ్యాఖ్యానాలు చేశారు. ప్రచారాలు సాగించారు. అనుయాయులను ప్రోది చేశారు. ఇంతటి మహత్తర కార్యక్రమ నిర్మాణానికి మూలమైన ఆ మాటలలోని శక్తి అపూర్వము, అమోఘము అయి నందువలననే అది సాధ్యపడింది. నరుని, దుర్బలత్వాన్ని పోగొట్టి విజయుణ్ణి చేసింది గీతోపదేశం–తానేమిటో, ఈ సృష్టికి మూలమైన బ్రహ్మమేమిటో తెలియజెప్పాయి బ్రహ్మసూత్రాలు. వైరాగ్యాన్ని కలిగించే వేదాంతమును బోధించాయి ఉపనిషత్తులు.

**మాటలోని అందం – హృదయానికి ఆనందం :** గుప్తములు, సంక్షిప్తములు



అభిప్రాయము. ఐతే ఒకప్పుడు మాట్లాడితే ఎంత మంచిదో, మరొకప్పుడు మాట్లాడకపోవటము అంత మంచిదని అనిపించవచ్చు. ఆ అవసరం గుర్తించి మాట్లాడటం మౌనం వహించటం ఇంగితజ్ఞులకు మాత్రమే సాధ్యపడుతుంది.

**ఇష్టాయిష్టాలుకూడా ఉంటాయి :** లోకంలో నచ్చిన వారిని మెచ్చుకొని ఆకాశానికి లేవనెత్తటం, గిట్టని వారిని తిట్టిపోసి పాతాళానికి నెట్టివేయటం సర్వసాధారణం. 'కొందఱి మాట వింటే పెట్ట బుద్ధి అవుతుంది. కొందఱి మాటవింటే మొట్టబుద్ధి అవుతుంది.' అంటే ఇదేనేమో! విపరీతమైన ఆ వాగ్ధోరణి, వారి సంస్కారానికి అద్దంపడుతుంది.

**అతి సర్వత్ర వర్జయేత్ :** ఏవిషయంలో నైనా మితిమీఱి ప్రవర్తించరాదని పెద్దలు చేసిన నిర్ణయం తప్పక పాటించి తీరాల్సిందే. భగవంతుడు రెండు చెవులిచ్చి, ఒకనోరు పెట్టడంలో 'ఎక్కువ వినాలి, తక్కువ మాట్లాడాలి' అన్నది సూచింపబడింది. మనసుకు తోచిందల్లా తొందరపడి వెంటనే మాట్లాడటం కాకుండా, ఉచితా నుచితములు, సాధ్యాసాధ్యములు విచారించిన తర్వాతనే మాట్లాడాలి. 'మనసా చింతతం కర్మ, వచసా న ప్రకాశయేత్' అన్నారందుకే.

**అబద్ధానికి ప్రచార మెక్కువ :** కొందరి మాటలలో, కొన్ని కల్పనలు కూడా వింటూ ఉంటాం. అవే పుకార్లు (వదంతులు)గా వ్యాపించి, ఒకప్పుడు అనేక విధాలైన ప్రమాదాలకు కారణమవుతాయి. మంచి వెంటనే ప్రచారానికి నోచుకోక పోయినా, చెడు మాత్రం త్వరలోనే లోకాలను ఆక్రమిస్తుంది. 'నిజం చెప్పులు తొడుగుకొనేలోగా, అబద్ధం ప్రపంచం చుట్టివస్తుంది'. అన్న అర్థంగల చైనా వారి సామెత ఈ సందర్భంలో గుర్తుకు రాక మానదు.

**అసత్యవాది మాట లెవ్వరూ పట్టించుకోరు :** చిన్నప్పుడు మనం చదువుకొన్న 'నాన్నా పులి వచ్చిందన్న కథలోని యథార్థం ఇదేఅని గుర్తించగలం. ఒక వ్యక్తి ఒక్కరిని ఒక్కసారి మాత్రమే తన మాటలతో నమ్మించి మోసం చెయ్య గలడు. అతడు అందరిని, అన్నిసార్లు మోసగించలేడు. అప్పుడతనికి కలిగేవి అన్నీ అనర్థాలే. తగిలేవి చెప్పుదెబ్బలే.

**నిజం నిలకడ మీద తెలుస్తుంది :** నిజం నిష్ఠురంగా ఉండటం వలన లోకంలో

కొందరు దాన్ని పెడచెవిని పెడతారు. శ్రద్ధలేనివారికి హితం చెప్పటం అరణ్య రోదనే అవుతుంది. యథార్థవాది ఎప్పుడు లోక విరోధిగానే పరిగణింపబడతాడు. చెప్పుడు (చెడు) మాటలంటే అందరు చెవి కోసుకొంటారు. అయితే నిజం నిలకడమీద తెలుస్తుంది. అప్పుడింక నాలుక కొరుక్కొని ప్రయోజనం లేదు. నీచులైన వారికి మంచిగా చెప్పే మాట అర్థం కాదు. భయపెడ్తేనే మూర్ఖులైనవారు దారికి వస్తారు. "శఠే శాఠ్యం సమాచరేత్". వారిభాషవారికుంటుంది.

**వాక్ కాలుష్యాన్ని పరిహరించాలి :** లోకంలో ఇప్పుడు గాలి, నీరు, ఆహారం మొదలైన వానిలో కాలుష్యంచేరి ఆరోగ్యానికి భంగం ఏర్పడుతోందని తెలుసుకొని దానిని నివారించటానికి, శుద్ధి చేయటానికి ప్రయత్నిస్తున్నారు. ఒకప్పటికది నివారింపబడవచ్చునేమో కాని, వాక్కాలుష్యం వలన మలినమయిన మనస్సు స్వచ్ఛతను కోల్పోతుంది. అనర్థాన్ని కలిగిస్తుంది. దుష్ప్రవర్తనకు దారి తీస్తుంది. పచ్చకామెర్లు వచ్చిన వారికి లోకం...పచ్చగానే కనబడటం విడ్డూరమేమీ కాదు కదా !

రామాయణంలో పాప దర్శనియైన మంథర మాటలలోని కాలుష్యానికి లోనైనది కైక. ఆమె విపరీత వర్తన వలననే వారి పచ్చని సంసారంలో చిచ్చురేగింది. రామ వనవాసము, దశరథ మరణము మొదలైన కష్టాలు, నష్టాలు సంభవించాయి. ఆమెకు శాశ్వతమైన అపకీర్తి మాత్రం మిగిలిపోయింది. అందుకే మన పెద్దలు చెడు వినకు, చెడు అనకు, చెడు కనకు అని ఉపదేశించారు. 'పుణ్య చరిత వినుట పుణ్యమకాదే' అని మంచి మాటలు వినండని ప్రోత్సహించారు. శివాజీ చిన్నతనంలో ధర్మవీరుల, సత్యవ్రతుల పురాణ గాథలు వినడం వలన ధర్మాత్ముడై వీరశివాజీగా మారి, దుష్టభయంకరుడుగా పేరుపొందాడు. లోకంలో సత్యధర్మాలను ప్రతిష్ఠించాడు.

**చెడు వినకు :** చెడు విన్నప్పుడు మనస్సు ఉద్రేక పడుతుంది. వివేకమును కోల్పోతుంది. నేర ప్రవృత్తికి పాల్పడుతుంది. పాపపు పనులకు ఒడికడుతుంది. యథార్థాన్ని కప్పిఉంచే ఆ చెప్పుడు మాటలు కొంపలు ముంచుతాయి. అందువల్ల అవి చెవిదాక చేరనీయరాదు. భారతంలో శకుని మాటలు విన్న దుర్యోధనుడు



నేర్చుకోవాలి. శాంత ప్రధానమైన, సంస్కారయుక్తమైన సంభాషణ శాంతికి, సౌఖ్యానికి దోహదం చేస్తుంది. ఆరోగ్యానికి, ఆనందానికి మూలమై నిలుస్తుంది.

**లక్షల విలువ చేసేవి అక్షరాలు :** మాటల విలువ తెలిసిన సహృదయ సంపన్నులు మెచ్చుకొని కవీశ్వరులకు పూర్వం అక్షర లక్షలు ఇచ్చేవారు. వారి మాటలకు మురిసిపోయి ధనం మూటలు కట్టి గౌరవంగా ముట్టచెప్పేవారు. భోజమహారాజు ఆ విషయంలో ప్రసిద్ధుడు. 'ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్ళకు కదలిక' తెస్తుందని కాళోజీ వివరించారు. అందువల్ల కవులు, రచయితలు బాధ్యతతో వ్యవహరిస్తూ 'తామేమి వ్రాస్తున్నాము, అవి జాతి మనుగడకు, అభివృద్ధికి ఎంత వఱకు ప్రయోజనకరంగా ఉంటున్నాయి' అనేది పర్యాలోచించు కోవాలి.

**బద్ధకస్థులకు ఏమి చెప్పినా ప్రయోజనంలేదు :** 'అబ్బాయి నీ ముక్కుకు చీమిడి ఉందిరా! అంటే, బాబాయి నీ చేత్తోనే అది తీసెయ్' అంటారు బద్ధకస్తులు. అందువల్ల ఎవరికి, ఏ మాట చెప్పటానికి ముందుకు రారు కొందరు. గాంధీగారు మాత్రం, రేపటి పని ఈ రోజే పూర్తి చేసుకోమన్నారు. అది ఎంత మంది పాటిస్తున్నారు? పెద్దల మాట విన్నవాడు బాగుపడతాడు, లేకపోతే అధోగతి పాలవుతాడు. అందుకే మంచి మనిషికొక మాట చెప్పిన చాలునన్నారు.

**అడిగితే, తెలిసింది చెప్పాలి :** ఇతరులు అడగందే ఏ మాట, చెప్పరాదు. అడిగినప్పుడు తెలిస్తే చెప్పకపోవటం కాని, సత్యాన్ని కప్పి పుచ్చి వేరొక విధంగా చెప్పటంగాని నేరమని చెప్పారు. అజ్ఞానులకు జ్ఞానాన్ని ఉదార బుద్ధితో బోధించటం, వలన సమస్త భూమినీ దానం చేసినంత ఫలితం లభిస్తుందని భారతం వెల్లడించింది. ఈనాటి 'అక్షరదీక్షా' ప్రచార కార్యక్రమాలలోను ఈ రహస్యమే చోటు చేసుకొంది. ప్రజలలో అక్షరాస్యులైనవారు సత్యం తెలుసుకొంటారు. కర్తవ్యాన్ని పాటిస్తారు. దేశాభివృద్ధికి పాటుబడతారు. సమాజంయొక్క సుఖశాంతులకు దోహదం చేస్తారు. అందువల్ల ఎప్పుడు మంచిని ప్రోత్సహించే మాట చెప్పాలి. పూర్వం, గురుకులాలు ఈ పాత్ర పోషించేవి – ఈనాడు కూడా, ఉచిత విద్య నందిస్తున్న మహానుభావులున్నారు. వారికి నా అభివందన మందారాలు. అభినందన చందనాలు.

చీకటిలో పరపురుషుడని భ్రాంతిపడి చంపటానికి ప్రయత్నించాడు. ఆ సందర్భంలో అదృష్టవశాన కవి శ్లోకం అతని కంటబడింది. అందులో 'విచారించకుండా తొందరపడి ఏ పనీ చేయరాదు. అట్టి అవివేకులకు ఆపదలు సంభవిస్తాయి. వివేకవర్తనులు అయిన వారికి అప్రయత్నంగానే సర్వ సంపదలు సిద్ధిస్తాయి'. అనే మాటలు ఉండటం చూచి అతడు కొంతసేపు ఆలోచించి, అప్పటి తన ప్రయత్నాన్ని మఱునాటికి వాయిదా వేసాడు. తెల్ల వారిన తర్వాత, తీరా విచారిస్తే అతడు తన, కులదీపకుడు, వంశవర్ధనుడు అయిన తన తనయుడని తెలిసి రాత్రి తానెంత అనుచితంగా ప్రవర్తించబోయింది తలచుకొని, సిగ్గుపడి, తనకు అట్టి ఆపద కలుగకుండా కాపాడిన ఆ కవి వాక్కును మెచ్చుకొని, అతనిని పిలిపించి సన్మానించి, ఆ శ్లోకాన్ని బహుమానపురస్సంగా, తిరిగి, అతనికిచ్చి పంపించాడు. అట్టి మాటలకు ఇంతని విలువ కట్టలేం కదా! పూర్వం రాజులైతే, అక్షరలక్షలిచ్చేవారని ప్రతీతి.

**ఆవేశంతో కూడిన మాట అనర్థాలకు దారి తీస్తుంది :** నిత్య జీవితంలో మనిషి అనేక సమస్యలతో సతమతమవుతూ, ఉంటాడు. అందువల్ల కలిగే ఆవేదనలకు, ఆవేశాలకు మితం ఉండదు. ఆవేశం వచ్చినప్పుడు శారీరకంగా కొన్ని మార్పులు వస్తాయి. కళ్ళెఱ్ఱబడటం, పెదిమలు అదరటం, మాట తడబడటం జరుగుతుంది. రక్తపోటు అధికమై, నరాల బలహీనత ఏర్పడుతుంది. ఒక పరిస్థితిలో కాలు చేయి, నోరు పడిపోయి పక్షవాతం, వచ్చే ప్రమాదం లేకపోలేదు. కొన్ని సందర్భాలలో గుండెపోటు వస్తుంది. కొందరి విషయంలో తిరిగి బ్రతుకుతారన్న ఆశ సున్న. ఆ సమయంలో ఏం మాట్లాడుతున్నారో తెలియక, చిన్న, పెద్ద అన్న విచక్షణ మఱచిపోయి, కలహ కారణమైన అనుచిత సంభాషణ కూడా చేయటం జరుగుతుంది. అందులో భాగంగానే ' నఱికి పోగులు పెడతాను' 'చంపి పాతిపెడతాను' వంటి తీవ్రమైన మాటలు కూడా దొర్లుతాయి. హత్య చేయటం ఎలానేరమో, చేస్తానని అంటమూ అలాగే నేర మవుతుంది. ఆత్మ రక్షణకై హత్య చేసిన వాడికి ఒకప్పుడు శిక్ష తగ్గించ బడవచ్చునేమో కాని, చేస్తానన్న వాడిని న్యాయవ్యవస్థ శిక్షింపక మానదు. అందువల్ల మాటలు జాగ్రత్తగా మాట్లాడం



సజ్జనులైన పాండవులతో విరోధం పెంచుకొన్నాడు. కర్ణుని దుష్టప్రేరణ వలన ద్రౌపదీ వస్త్రాపహరణానికి పూనుకొన్నాడు. ఆ దురాగతాలకు ఫలితం ఆత్మ వినాశనం. అందువల్ల విన్నదాన్ని వివేకంతో విచారించి, కల్ల, నిజము తెలుసుకోవటం నీతిపరుని లక్షణ మంటాడు సుమతీ శతక కర్త బద్దెన.

వినదగు నెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపఁదగున్
కని కల్ల నిజముదెలిసిన, మనుజుడెపో నీతి పరుడు మహిలో సుమతీ!

**చెడు అనకు :** కొందఱు ప్రతి విషయంలోను ' నీ మొహంమండ', ' నీ తల్లి కడుపు కాలిపోను' నీబ్రతుకుచెడ అని ఇతరులకు శాపనార్థాలు పెడుతూ ఉంటారు. కొందఱు మాటకు ముందు 'ఆ', నా మొహం, ఏడ్చినట్టే ఉంది. అనో, 'నా బొంద, నాబోలె' అనో, తమను తాము నిందించుకొంటూ ఉంటారు. 'పైన తథాస్తు దేవతలు ఉంటారు. మనం అన్న మాటలు విని, వారు 'అట్లే అగుగాక' అని దీవిస్తారు. అందువల్ల 'అది తగని పని', అని చెప్పి పెద్దలు తెలియజేశారు. ఆ విషయమే ' నా ఉ_శ్లీలం కీర్తయేత్' అని వేదం అశ్లీల వచనములు పలుకరాదని నిషేధించింది. మంచిని సంకల్పించి, మంచి మాటలే మాట్లాడమని ప్రేరణ నిచ్చింది. మంచి మాట విననివాడే చెవిటివాడు. మంచి మాట అననివాడే మూగవాడు.

**చెడు కనకు :** జ్ఞానాన్ని ఇచ్చే మంచి పుస్తకాలు చదవాలి. మంచిని పెంచే సినిమాలు నాటకాలు చూడాలి. స్ఫూర్తిదాయకములైన ప్రదేశములను, ధన్యతములైన సాధు, సజ్జనులను దర్శించి, జీవితం సార్థకం చేసుకోవాలి. చెడును ప్రేరేపించే దుష్టరచనలు (బూతు పుస్తకములు) చదివి, హింసను, ద్వేషాన్ని రగుల్కొల్పి, నేర ప్రవృత్తికి దారితీసే సినిమాలు , నాటకాలు చూసి, దుర్జన సాంగత్యంచేసి దుర్గతిపాలు కారాదని సూచించారు. దుర్జనులనుచూచినా, వారి మాటవిన్నా, వారి దుర్గుణములను గూర్చి చెప్పుకొన్నా, వారితో కలిసి జీవించినా, అనర్థమే అని ప్రకటించారు. "మంథరా పాపదర్శనీ" వాల్మీకి వక్కాణించాడు.

**ఆత్మస్తుతి-పరనింద పనికిరావు :** లోకంలో కొందఱు మాటిమాటికి నేనింత వాణ్ణి, అంతవాణ్ణి అని గొప్పలు చెప్పుకొనేందుకు ప్రయత్నిస్తారు. అదే సమయంలో

ఇతరుల చేతకాని తనాన్ని, తెలివి తక్కువతనాన్ని ఎక్కువగా నిరూపించటానికి పూనుకొంటారు. అది వారి దురహంకారాన్ని సూచిస్తుంది. అదే విధంగా మఱికొందఱు తమను తాము కించపరచుకొంటూ, ఇతరులను ఇంద్రులు, చంద్రులు అని పొగడ్తలలో ముంచి ఎత్తుతారు. అది వారి ఆత్మన్యూనతా భావాన్ని తెలియజేస్తుంది. పై రెండు పద్ధతులూ పనికి రావని భారతం నిరూపించింది. "అన్యకీర్తనంబు,నన్యనిందయుదన్నుఁబగరబొగడికోలుఁబ్రబ్బికోలు...... ఆర్యవృత్తములుగా వనిరివీనినాద్యులైనమునులు". ఆత్మవిశ్వాసాన్ని కోలుపోకుండా, అహంకారం పొడచూపకుండా మాట్లాడటం కత్తిమీదసాము వంటిదని, దానికి ఎంతో సంయమనం కావాలని విజ్ఞులు చెప్తారు. లేకపోతే ప్రమాదాలు సంభవిస్తాయి. 'నోరా! వీపుకు దెబ్బలుతేకే' అని హెచ్చరించి, 'నోరు మంచిదయితే ఊరు మంచి దవుతుందని పెద్దలు ఉపదేశించారు.

**దురహంకారంతో మాట్లాడరాదు :** తనను తాను పొగడుకొనేవాడు దురహంకారి. ఇతరుల నతడు గౌరవించలేడు. అట్టివాడు పతనావస్థ పొందక తప్పదు. అశోకవనంలో, రావణుడు, రామునిగూర్చి దుహహంకారంతో పలికిన పలుకులు విన్న సీత, అతనిని తృణప్రాయంగా ఎంచి 'వినకూడదు, నీదు, నీతి విరహిత భాషల్' (మొల్ల) అని నిరసించింది. "భూరిగుణోన్నతులనదగువారికి ధీరులకు, ధరణివల్లభులకు వాక్పారుష్యముచన్నే? మహాదారుణమది విషముకంటె దహనముకంటెన్" అని ధర్మరాజు శిశుపాలునకు భారతంలో ప్రబోధించారు.

**వివేకవంతులకు వినయమే అలంకారము :** సీతాన్వేషణకై, శతయోజన విస్తీర్ణమైన లవణ సముద్రాన్ని దాటి, లంకకు వచ్చిన హనుమంతుడు, సీత అడిగితే "సుగ్రీవునివద్ద తనతో సమానులు, తన కంటె అధికులు అయిన వానర వీరులు ఎందరో ఉన్నారనిచెప్పి, అందఱికంటె, తాను చిన్నవాడు కనుకనే లోక మర్యాద ననుసరించి తానిట్టిపనికి పంపబడినా"నని వివరించి, తన వినయాన్ని ప్రకటించాడు. సీత హృదయానికి ఊరట కలిగించాడు.

**మాటలే వరాల మూటలు – సుఖాల బాటలు :** మాటలచేత మన్ననలు పొందిన దేవతలు వరములను, భూపతులు పురములను, కామినులు సుఖములను ఇస్తారు;



సత్యమైన విషయం కూడా సూటిగా చెప్పరాదు. ఇది సనాతన ధర్మము. వివాహంలో సృష్టి ధర్మం ఇమిడి ఉంది. అందుకే పెద్దలు వెయ్యి అబద్ధాలాడైనా, ఒక పెళ్ళి చెయ్యమనటంలో ఈ రహస్యమే వివరించబడింది. భూత హితం కొఱకు, ధర్మ రక్షణ కొఱకు అనృతము పలుకుట వలన పాపము కలుగకుండుటయే కాదు, సత్య ఫలమునే ఇచ్చుననుట ఇందలి ధర్మసూక్ష్మము. ధర్మము కంటే, ధర్మసూక్ష్మము మిక్కిలి గొప్పది. సామాన్య ధర్మము కంటె విశేషధర్మము గొప్పది.

**మాటవలన పరివర్తన సాధ్యపడుతుంది :** మంచి మాటలు బోధించటం ద్వారా మనుష్యుల స్వభావం మారుతుంది. నిప్పు కాలుతుందని చెప్పినప్పుడు ముట్టుకోకుండా ఉంటారు. అందుకు స్వానుభవం కొంత దోహదం చేస్తుంది. తప్పు చేసినవారి తప్పిదమేమిటో తెలియజేసి, కర్తవ్యమేమిటో గుర్తు చేసినప్పుడు వారు పరివర్తనచెందే అవకాశం ఉంది. జైలులో ఉన్నవారిని సంస్కరించటం కొఱకు నీతి బోధచేయటం, నేర ప్రవృత్తి మానుకొమ్మని చెప్పటం జరుగుతుంది. ఆ సదుపదేశామృతమును కర్ణాంజలితో తవిలి త్రావిన వారిలో కొందఱు పరివర్తన చెందుతారు. వ్యాధిగ్రస్థుడైన వానికి వైద్యంతోబాటు, దుఃఖోపశమనమును గూర్చే మాటలు కూడా కొంత ప్రయోజనాన్ని చేకూరుస్తాయి.

**మాట మనుష్యుని ఆలోచింప చేస్తుంది :** హితముతో కూడిన రసరమ్యములైన మాటలకే సాహిత్యమని పేరు. సాహిత్యము ఆలోచనామృతమై మానవుని ఔన్నత్యానికి మార్గదర్శనం చేస్తుంది. సాహిత్యంలో అనేకమైన శాస్త్ర విషయములు సులభంగా బోధింపబడి పఠితలకు విజ్ఞానాన్ని కలిగిస్తున్నాయి. కవుల ప్రతిభా పాండిత్యముల కవి, నిదర్శనములై నిలుస్తున్నాయి.

పూర్వం 'భారవి' అనే కవి 'కిరాతార్జునీయమ్' అన్న గొప్ప సంస్కృత కావ్యం వ్రాశాడు. అందులో ఒక శ్లోకం ఒక ధనికునివద్ద కుదువబెట్టి అవసరానికి కొంత ధనం తీసుకొన్నాడు. ఆ ఋణం తీరిన తర్వాతనే కావ్యం ప్రకటించటానికి నిర్ణయించుకొని, ఆ అవకాశం కొఱకు ఎదురు చూస్తున్నాడు. ఆ ధనికుడు వ్యాపారం పనిమీద దేశాంతరంవెళ్ళి చాలా కాలానికి తిరిగి వచ్చాడు. ఆ రాత్రి పొద్దుపోయింది. తల్లి దగ్గఱ పడుకొని ఉన్న తన కూమారుని దూరంగా చూచి

ఆదిత్య హృదయం పుణ్యం సర్వశత్రు నివారణం।
జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్॥

అంతట, ముని వలన అది విన్న రాముడు సంతోషంగా ముమ్మారు పఠించి, సమధికోత్సాహంతో రావణుని సంహరించి, లోకములకు దుష్టరాక్షస బాధ తొలిగించాడు. పునః (తిరిగి) ప్రియసమాగమ సుఖాన్ని పొందగలిగాడు. దేశ రక్షణకై దీక్ష వహించిన సైనికులకు పౌరుష ప్రధానమైన వీరగాథలు, దేశభక్తి పూరితమైన, త్యాగమూర్తుల చరిత్రలు చెప్పి ఉత్తేజితులనుజేసి, యుద్ధంలో విజయాలను సాధించే విధంగా, ప్రోత్సహపరుస్తారు. పిల్లలను చిన్న తనంనుండే వారేమి కాదలచుకొన్నారో అడుగుతూ, వారి అభిప్రాయానికి తగినట్లు ఆ, యా రంగములలోగల విజ్ఞాన విశేషములు తెలియజేస్తూ, వారి ఆలోచనలకు దోహదం చేయగలిగితే, ఆపిల్లలే దేశ భవిష్యత్తును తీర్చిదిద్దే సత్పౌరులై వారు కోరుకొన్న విధంగా (డాక్టర్లు, ఇంజనీర్లు, మాష్టర్లు, మినిష్టర్లు) రూపొందటానికి అవకాశాలు ఉన్నాయి.

అభినందన, అభిమానాన్ని కలిగిస్తుంది. పరిచారకులను ప్రత్యక్షంగాను, బంధవులను పరోక్షంలోను, మిత్రులను మిత్రుల సమక్షంలోను మంచిగా అభినందించటం ద్వారా, వారి అభిమానానికి పాత్రులవుతారని పెద్దలు చెప్తారు.

**ఉద్వేగాన్ని పెంచే మాట వెంటనే చెప్పరాదు :** లౌకిక జీవితంలో ప్రతి వారికి ఎన్నో కష్ట, సుఖాలు ఎదురవుతూ వుంటాయి – వానివల్ల ఉవ్వెత్తున పొంగివచ్చే దుఃఖంగాని, ఆనందంగాని మానవులను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. ఆ భావాల వెల్లువకు ఎదురు నిలబడి తట్టుకోవటం సామాన్యులకు సాధ్యంకాదు. వారికి మానసిక సంసిద్ధత కలిగేలా విషయంమెల్లగా చెప్పాలి. 'చావు కబురు చల్లగా చెప్పటం' అంటే ఇదే కాబోలు. అనూహ్యమైన 'అవార్డులు (లాటరీలు) డబ్బులు వచ్చాయి' అన్న సంతోషవార్త కూడా జాగ్రత్తగా చెప్పాలి. నిదానమే ప్రధానము.

**ధర్మ సూక్ష్మాలు కొన్ని పాటించాలి :** సత్యం చెప్పాలి, నిజమే; చెప్పేది సత్యమే అయినా అది ప్రియమైన మాటలలో చెప్పాలి. ఆ ప్రియమైన మాటలు, చెప్పేటప్పుడు అందులో అసత్యం చోటుచేసుకోకూడదు. వింటానికి అప్రియమయినప్పుడు



మాట్లాడటం చేతకానివారికి లోకంలో అవమానము, తక్కువ తనము, మానభంగము కలుగుతాయి. అందువల్ల నేర్పుగా మాట్లాడటం నేర్చుకోవాలి. అప్పుడా మాటలే కార్యసాధనము చేకూర్చే మహిమగల మంత్రములవుతాయి.

**పోరు నష్టము – పొందు లాభము :** మాటకలిస్తే స్నేహము, మాట బెడిస్తే విరోధము ఏర్పడుతుంది. 'మాటకు మాట తెగులు – నీటికి నాచు తెగులు' అన్నట్లు ఒకరొక మాట మిగిలితే మరొకరు మరిన్ని మాటలంటారు. మాట పట్టింపువస్తే మిత్రులే శత్రువులయి పోతారు. అప్పుడు సరసము విరసంగా మారుతుంది. వాతావరణం వేడెక్కుతుంది. పొగలు సెగలు బయల్దేరుతాయి. సదవగాహన లోపిస్తుంది. సహకారం దూరమవుతుంది. పగ, ప్రతీకారాన్ని కోరుకొంటుంది. ఒకప్పుడు వారి ఉనికికే భంగం కలుగవచ్చు. స్నేహంలో తమ సర్వశక్తులు వినియోగిస్తారు. తుదకు ప్రాణమయినా ఇవ్వటానికి సిద్ధ పడతారు. అందువల్ల ఎవరి హద్దులలో వారుండి స్నేహధర్మాన్ని కాపాడుకొనటం వలన ఎంతో ప్రయోజనం ఉంది. పొసగఁబలుకుట(తగినట్లు మాట్లాడుట) వలన కలిగే లాభం గూర్చి భారతం ఇలా చెప్పింది.

చెలిమియు,బగయును, దెలివియు, గలకయు ధర్మంబుcబాపగతియునుc, బెంపున్
దులువ తనంబును వచ్చును బలుకుబడిన; కాన పొసcగcబలుకcగ వలయున్
ఉ.ప.2/60 ప.

పలుకుబడి అంటే మాట తీరు అని అర్థం. లోకంలో ఫలానా వారికి గొప్ప పలుకుబడి ఉంది; అంటే వారి మాటకు ఎక్కువ గౌరవం ఉందని, ఆ ప్రాంతంలో అది చెల్లుబడి అవుతుందనీ, అర్థమన్న మాట.

**పరుషంగా మాట్లాడరాదు :** కొందఱు, మాటకు ముందు నిందా వాక్యాన్ని ప్రయోగిస్తారు. పానకంలో పుడకల్లాగా అవి సంభాషణకు అభ్యంతరకరము లవుతాయి. భారతంలో రాజసూయ యాగం జరిగే సందర్భంలో శిశుపాలుడు కృష్ణ, భీష్ములను నిందించడం చూచి, ధర్మరాజు అతనితో వాక్పారుష్యం పనికిరాదని, అది సభామర్యాద కాదని చెప్పి, నిప్పుకన్నా, విషం కన్నా అది భయంకరమైనదని బోధించాడు.

ఒక్కొక్కసారి అగ్ని ప్రమాదానికి గురియైనవాడు, విషప్రయోగానికి బలియైనవాడు బ్రతికి బట్టకట్ట వచ్చునేమోకాని పరుషవాక్ దోషానికి పాల్పడినవాడు తప్పక ప్రమాదాల పాలవుతాడని హెచ్చరించాడు.

నరక గృహద్వారములైన కామ, క్రోధ, లోభములచే ప్రేరితుడైన మానవుడు (ఉద్రేకపడి) పాపకృత్యములు చేయటానికి పూనుకొంటాడు. ఆ కారణంచేత అసుర గుణములైన కామ క్రోధాదులను విడిచి పెట్టాలని గీతలో బోధించారు. అందులవల్ల పరుష వాక్యములు పలుకరాదని, పాపకార్యములు చేయకూడదని నిషేధించి, పెద్దలు, ఈ రెండు నియమములు పాటించటం వలన లోకంలో మానవులు ఉత్తములుగా పరిగణింపబడతారనే సత్యాని వెల్లడించారు.

**పరుల మనసు నొప్పించరాదు :** ఆయుధాల వలన శరీరానికి తగిలిన దెబ్బలు క్రమంగా తగ్గి, గాయాలు నమవుతాయి. ఆమచ్చలు కూడా మాయమైపోతాయి. ఈటెలవలె అతి నిష్ఠురంగా మనమున నాటుకొన్న మాటలు మాత్రం ఎన్ని ప్రయత్నాలు చేసినా తొలగిపోవు. మరచి పోదామన్నా మరపురావు.

**'ఆత్మవత్ సర్వభూతాని' :** 'సమస్త ప్రాణులు తమవంటివే అని తెలిపి,' వానియెడ అభిమానం గలిగి ప్రవర్తించాలని శ్రుతులు ప్రతిపాదిస్తున్నాయి. ఇతరులేమి చేస్తే తమ మనస్సుకు కష్టం కలుగుతుందో తాము ఇతరులకవి చేయకుండుటయే ధర్మములలోకెల్ల శ్రేష్ఠమైన ధర్మమని భారతం వివరించింది. ఇనుము విఱిగితే రెండుసార్లో, మూడుసార్లో అతుకవచ్చునుగాని, మాటల వలన మనసు విఱిగితే తిరిగి అతకటం కష్టం అంటాడు వేమన. అందువల్ల ఉద్రేకంతో ఇతరులను రెచ్చగట్టే విధంగా మాట్లాడరాదని, సత్యము, ప్రియము, హితము అయిన మాటలు పలుకుట, వేదాధ్యయనము, వాచికమైన తపస్సు అని గీతాచార్యుడు ఉపదేశించాడు. 'అనుద్వేగ కరం వాక్యం, సత్యం, ప్రియహితం చ యత్। స్వాధ్యాయాభ్యసనంచైవ, వాఙ్మయం తపఉచ్యతే॥'. ఆ జగద్గురువు సందేశం పాటిస్తే విశ్వమంతటా శాంతి వెల్లివిరుస్తుంది.

**ఇంద్రియ జయాన్ని సాధించటమే తపస్సు :** ప్రాణులకుగల పంచేంద్రియములలో వాక్కు కూడా ఒక ఇంద్రియం అవటం చేత ఇంద్రియాలను జయించి, చేసే



వలన దాని ఔన్నత్యానికి భంగమేమీ కలుగదు. కాల మనుకూలముగా లేనప్పుడు మాటల తీవ్రత అణుచుకోవాలి. అదునుకోసం ఎదురు చూడాలి.

**లోకులు పలుకాకులు :** మెత్తవాణ్ణి చూస్తే, మొత్త బుద్ధి అవుతుంది. అమాయకులను చేసి ఆట పట్టించటానికి ప్రయత్నిస్తారు. ఉన్న'గుణాన్ని' కప్పిపుచ్చి, లేని దోషాన్ని అంటగట్టే లోకులు పలుకాకులు. ఏ విషయంలోనైనా, గోల చేయటం వారి స్వభావం. సౌజన్యం, సౌశీల్యం గల వారికి అది ఏ విధంగాను హాని కలుగఁజేయలేదు. ఏనుగు గంభీరంగా దారిన పోతున్నప్పుడు ప్రక్కనచేరి కుక్కలెన్ని మొఱగవు. అఱిచే కుక్కలు కఱవవు. నవ్వినా నాపచేనే పండుతుంది. పడ్డవాడు ఎప్పుడు చెడ్డవాడు కాడు. ఇవి అన్నీ మానవ మనస్తత్వాన్ని నిరూపించే మాటలు. అనుభవం దాచిఉంచిన ధనంమూటలు. భావితరాలకు పఅచిన బంగారు బాటలు.

**సభారంజకంగా మాట్లాడాలి :** సభ్యతగలవారు చేరింది సభ. ఆ సభలో పాటలు పాడితే అది పాటకచేరి అంటాం. మాటలు మాట్లాడితే అది మాట కచేరి అవుతుంది. సభవారు మెచ్చుకొనే సరసమైన మాటలే మాట్లాడాలి. లేకపోతే రక్తికట్టదు. అందుకే 'సభ మెచ్చని మాటలెల్ల చప్పన' అని సూచించాడు సుతీశతక కర్త బద్దెన. ఆయనే 'రసభరితమైన నుడువుల కెల్లన్ నోరే ఆధారమ'ని చెప్పి, తత్తద్రస పోషణలో కవులు మెలకువలు పాటించండని ప్రబోధించాడు. ఔరా అనిపించే తన మాటలకు నోరూరించి, చవులు (రుచులు) పుట్టించే అద్భుత శక్తి ఉందని చెప్పి, తన శతకమే అందుకు ఉదాహరణమని నిరూపించాడు.

**స్ఫూర్తినిచ్చేది, గమ్యాన్ని నిర్దేశించేది మాట :** సూర్యుడుదయించగానే, చీకట్లు మాయమైపోతాయి. ప్రాణి ప్రపంచం విజ్ఞాన వికాసాల్ని పొందుతుంది. అదే విధంగా ఒక మంచి మాట జడత్వాన్ని, విమూఢత్వాన్ని పోగొట్టి మనిషిని జాగృతి పరచి, వ్యక్తిత్వనిర్మాణంచేసి కర్తవ్యనిష్ఠుని చేస్తుంది.

రామ రావణ సంగ్రామంలో మిక్కిలి అలసటచెంది, నిర్విణ్ణుడైయున్న రామునకు అగస్త్యుడు చింతాశోకములను పోగొట్టి, శత్రు విజయాన్ని సాధించిపెట్టి, పుణ్యఫలదమై, శుభములను ప్రసాదించే ఆదిత్య హృదయ స్తోత్రమును ఉపదేశించాడు.

నువ్వా అంటావా? అని కోపంతో నిందించాడు. మళ్ళీ అవే మాటలు ప్రతి ధ్వనించాయి. అతడు ఆశ్చర్యంతో తల్లి దగ్గఱకుచేరి, జరిగింది చెప్పాడు. ఆమె, ఈసారి మర్యాదగా మాట్లాడి చూడమని చెప్పి పంపించింది. తల్లిమాట విని వెళ్ళిన బాలుడికి, తన మాటలకు తగిన, మర్యాదతో కూడిన సమాధానం లభించింది. అప్పుడు అతడు ఎంతో సంతృప్తి పడ్డాడు. ఇదే లోకంపోకడ. 'తన కోపమె తన శత్రువు, తనశాంతమె తనకు రక్ష,' దయచుట్టంబౌ' అన్నది అక్షరాలా సత్యం. 'అని, అనిపించుకోకే అత్తగారా' అన్నట్లు తా నితరులను ఒక మాట అంటం దేనికి? తనను వారన్నారని బాధపడటం దేనికి?

**గర్వం పనికిరాదు :** ధనము,అధికారము, యౌవ్వనము, అందము, మానవులకు గర్వం ఏర్పడటానికి హేతువులుగా పేర్కొన్నారు. ఇవి ఏవీ శాశ్వతములు కావు. అందుకు విఱ్ఱ వీగటం తగదు. ఏవిషయంలో నైనా, తాడి తన్నేవాడు ఒకడు ఉంటే, వాడి తలఁదన్నే వాడు ఇంకొకడు ఉంటాడనేది నిజం. ఎంతటివారికైనా లోకంలో నాయంతటివారు లేరని గర్వపడటం, కానిమాట లని అందరితోను విరోధం తెచ్చుకోవటం, పనికిరాదు. అది కాపురుష లక్షణం. దుందుడుకు తనంతో దురుసుగా మాట్లాడకూడదు. ఎప్పుడు, నలుగురితో స్నేహంగా ఉండాలన్న పెద్దల మాటలు జీవితాంతము ఎంతో ప్రయోజనకరంగా ఉంటాయి. బుద్దిబలం గలవాడే బలవంతుడు. కుందేలు శారీరకంగా చిన్నదే అయినా బుద్ధిబలంతో సింహాన్ని బావిలో పడద్రోసింది. మావటి వాడేనుగు నెక్కి నడిపిస్తున్నాడు, ఆజ్ఞాపిస్తున్నాడు.

**ఈశ్వరుడుకాక మఱెవ్వరు సర్వజ్ఞులు కారు :** ఒకరి కొక విషయంలో ఉన్న పరిజ్ఞానం, మఱొక విషయంలో లేక పోవచ్చు. తెలిసినవారు చెప్పినప్పుడది విని నేర్చుకోవాలి. సక్రమమైనదైతే అది బాల వాక్కైనా బ్రహ్మవాక్కే అవుతుంది. (తప్పక పాటింపవలసి వుంటుంది) తనకది తక్కువతనంగా భావించరాదు. ఎదుటివారు చెప్పే హిత వచనాలను వినగలిగే సహనశీలం పెంపొందించుకొమ్మని బోధించటం కోసమేనేమో, బద్దెన మనలను సుమతీ! అని సంబోధిస్తాడు.

**ఒదిగి ఉంటే కొదువ కాదు :** రత్నం విలువ తెలియనివాడు అది రాయి అన్నంత మాత్రం చేత రత్నానికి విలువ తగ్గదు. కొండ అద్దంలో కొంచెమై ఉండటం



తపస్సాధనలో వాఙ్నియమాన్ని పాటించటం కూడా ఒక భాగంగా పేర్కొనటం జరిగింది. ఆవేశాన్ని తగ్గించుకొని ఆలోచనను పెంపొందించుకోవటం ద్వారా అది సాధ్యపడుతుంది. అట్టి ఘనులనే మునులని వ్యవహరిస్తారు. వారి స్వభావమే మౌనం. మౌనం వలన కలహం లేదు. 'మౌనేన కలహం నాస్తి'. 'మౌనమే నీ భాష ఓ మూగ మనసా' అంటాడు ఒక మనసు కవి. ఆ మౌనమే అన్ని సమస్యలకు పరిష్కారంగా సూచించారు రమణ మహర్షి వంటి పెద్దలు. 'మౌనం సర్వార్థ సాధకమ్.'

మౌనంలోనే జ్ఞానం ఉదయిస్తుంది. సత్యం గోచరిస్తుంది. సిద్ధార్థుడు బుద్ధుడైన వైనం మనకు తెలిసిందే కదా! మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం' అని శంకరులు దక్షిణామూర్తి స్తోత్రంలో వివరించారు. బ్రహ్మతత్త్వం తెలిస్తే అన్నీ తెలిసినట్లే అని దాని భావం. మాటకొక శక్తి ఉంటుంది. మౌనానికి అంతకంటె మించిన శక్తి ఉంటుంది. పాశ్చాత్యులు సహితం మాట వెండితో సమానమని, మౌనం బంగారంతో సమానమని వర్ణించారు. "Speach is Silvar, Silence is Gold". వాని విలువ తెలిసినవారు తమకేది ఎంత ముఖ్యమో నిర్ణయించుకొంటారు. అది కేవలం వారి వివేకం మీద ఆధారపడి ఉంటుంది. 'విభూషణం మౌన మపండితానామ్॥ అజ్ఞులైనవారికికూడ సభలలో మౌనమే అలంకారమని, వారు మాట్లాడక పోవటమే మంచిదని, భర్తృహరి వివరించాడు.

**మాటలే మంత్రాలు :** చెప్పినవారిమీద గౌరవం ఉంచి, మననంచేస్తే, మాటే మంత్రం అవుతుంది. మననం వలన అనుభవం ఏర్పడుతుంది. అనుభవం లేనప్పుడు ('తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' మొదలైన) మహావాక్యాలు కూడా మన వాక్యాలే అవుతాయని జ్ఞానమూర్తియైన మాతృశ్రీ జిల్లెళ్ళమూడి అమ్మ చెప్పింది. 'ఇది యేమిటి' అనేది పంచాక్షరీ మంత్రమని, 'అసలు ఇది యేమిటి' అనేది అష్టాక్షరి మంత్రమని అమ్మ ఉపదేశించింది. ఆవిధంగా ప్రశ్నించుకొని, తత్త్వవిచారణ చేయటం ద్వారా సత్యాన్ని నిరూపణ చేసుకోవాలన్నది అందులోని పరమార్థము.

**సత్యవ్రతుని వృత్తాంతము :** దేవీ భాగవతంలో అతని కథ ఈ విధంగా

'వర్ణింపcబడింది. సత్యవ్రతుడు చిన్నతనం నుండి జడప్రాయుడై అవిద్యావంతుడై, లోకంచేత ఈసడింపcబడి, అడవిలో, ఒంటరిగా నివసిస్తూ ఉండేవాడు. ఒకనాడు కిరాతునిచే కొట్టబడిన పంది ఒకటి, బాధతో 'ఐం' 'ఐం' అని అరుస్తూ అతని ఆశ్రమ ప్రాంతానికివచ్చి ప్రాణభీతితో ఒక పొదలో దాగి ఉంది. అది విన్న సత్యవ్రతుడు (ఉతథ్యుడు) ఆ అక్షరాన్ని మననం చేయటం వలన, వాగ్దేవి అనుగ్రహాన్ని పొంది తత్ప్రాణ రక్షణలో విజ్ఞతతో వ్యవహరించాడు. లోకానికి పరమ పూజ్యుడైనాడు. దీన్ని బట్టి లోకంలో ప్రతి అక్షరం, లేక అక్షర సముదాయమైన పదము (మాట) మంత్రమే అని బోధపడుతుంది. మనుచరిత్రలో ప్రవరుడు తన ఇంటికి వచ్చిన సిద్ధునితో ' మీ మాటలు మంత్రంబులు...........' అన్నట్లు పెద్దన అభివర్ణించాడు. 'మంత్రము' అంటే రహస్య సమాలోచనము అనే అర్థం కూడా ఉంది. క్లిష్ట సమయంలో ఒక జటిలమైన సమస్యకు పరిష్కారాన్ని సూచించేది, ఒక ప్రభుత్వము యొక్క, దేశము యొక్క భవిష్యత్తును నిర్ణయించేది, ఎదుటివారి ఎత్తులకు పై ఎత్తులు వేసేది, మంత్రాంగమే అనేది అక్షరాలా నిజం. అందులో సమర్థులైన వారినే మంత్రులు అంటారు. వారి మాటలే ఒకప్పుడు మంత్రాలు అవుతాయి. తెలుగు వారిలో తిక్కన మంత్రి, తిమ్మరుసు మంత్రి మొదలగువారు ప్రసిద్ధులు. వారివలన రాజ్యాలు నిలబడ్డాయి. ప్రజలు, రాజులు సుఖపడ్డారు. స్వాతంత్రోద్యమ సమయంలో 'వందేమాతరం', 'మా కొద్దీతెల్ల దొరతనం', 'స్వాతంత్ర్యం మా జన్మహక్కు' మొదలైన మాటలు, పాటలై భారతదేశ పౌరులందటి నోట ప్రతిధ్వనించాయి. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాధికారాన్ని దేశంనుండి పారద్రోలాయి.

**మహాత్ముల మాట వ్యర్థము కాదు :** 'అ' నుండి 'హ' వఱకు గల అక్షర సముదాయమును 'వర్ణమాతృకలు' అని అంటారు. అవి, మన పారమార్థిక శరీరంలో గల షట్చక్రముల యందు ప్రకాశిస్తూ ఉంటాయి. ఆ వర్ణ మాతృకోపాసన, విధిగా చేసిన వారికి వాక్శుద్ధి ఏర్పడుతుంది. వారినే 'వశ్యవాక్కులం'టారు. అట్టి వారు నిర్మలమైన మనస్సుతో తిట్టినా, దీవించినా తప్పక జరిగితీరుతుందని, మాగురుదేవులు బ్ర.వే.తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి



అనుమానమే పెనుభూతమై అతని పీడిస్తుంది. అవమానాల పాలు చేస్తుంది.

**ఆడలేక మద్దెల ఓడన్నట్లు :** బండి సాగినంతవరకు తమ సామర్థ్య మని గొప్ప చెప్పుకొంటారు. సాగకపోతే కాడిపారేసి, ఇతరులపై నెపంవేసి నెమ్మదిగా తప్పుకొంటారు కొందరు. దీన్నే పెద్దలు అసమర్థ దుర్జనత్వం అంటారు. "చేతగానివాడు చేసిన పనులెల్ల, వట్టిపోవc బరులదిట్టిపోయు; ఆడలేక మద్దెలోడను రీతిగా, సాక్షిభావదేవ! సదయ హృదయ!"

**నాలుకతీపి, అంగిలి విషం :** కొందరి మనస్సు వెన్నలా మెత్తగా ఉన్నా, వజ్రంతో సమానమైన కఠిన వాక్యములు పలుకుతారు. వారితో ఇబ్బంది లేదు. 'ఉత్తమస్య క్షణం కోపం' అన్నట్లు వారు తిరిగి వెంటనే మృదుత్వాన్ని పొందుతారు. నీటికి చల్లదనం లక్షణమైన విధంగా వారికి శాంతమే స్వభావం. కొందఱు తేనెలొలికే విధంగా మాట్లాడుతారు. దాని వెనుక ద్రోహ చింతన దాగి ఉంటుంది. వారినే పయోముఖ విష కుంభాలని, మేక వన్నె పులులని వర్ణించారు. తేలుకుకొండెలో, పాముకు కోరలో మాత్రమే విషం ఉంటుంది. ఖలులకు నిలువెల్లా విషమే నిండి ఉంటుంది. అది గుర్తించి ఆ దుర్మార్గవర్తనులను ఎన్నడు నమ్మరాదు.

**ఆప్తవాక్యము ప్రమాణము :** మంత్ర మూలము గురుల వాక్యము. హితులైన తల్లిదండ్రులు, గురువులు, బాధ్యతగలిగిన ఇతర పెద్దలు, చెడుత్రోవలు త్రొక్కిన వారిని సన్మార్గంలో పెట్టటానికి మందలిస్తారు. నయాన కాకపోతే, భయాన అయినా కార్యం సాధిస్తారు. ఆప్తులు, ఆత్మీయులు అయినవారి మాట కష్టంగా తోచినా, తప్పక పాటించాలి. మేలు కోరే మిత్రుడు బలవంతంగానైనా కష్టాల ఊబిలో నుండి లాగి బయట పడేస్తాడు. అటువంటి మంచి మిత్రుని మాట మన్నించి తీరాలి. ఆప్తుడంటే, యథార్థమును చెప్పేవాడని నిర్వచించారు. "ఆప్తో నామయథార్థవక్తా"।

**సమాజం అద్దం లాంటిది :** అది మనం గౌరవిస్తే గౌరవిస్తుంది, ఈసడిస్తే ఈసడిస్తుంది. నవ్వితే నవ్వుతుంది, వెక్కిరిస్తే వెక్కిరిస్తుంది. ఒక ఊళ్లో పిల్లవాడొకడు ఊరి చివరనున్న కొండ దగ్గఱకు వెళ్ళి ఏదో ఎగతాళిగా మాట్లాడాడు – వెంటనే అతనికి తిరిగి అవే మాటలు వినిపించాయి. అప్పుడా కుర్రావాడు 'నేనన్న మాటలే

ఇంక కొందఱికి ఎదుటివారిలో తప్పులు వెదకటంలోనే కాలం గడుచిపోతుంది. అటువంటివారు తమను గూర్చి తామెన్నడు తలచుకోరు. వీరిని చూచినప్పుడల్లా గురువిందగింజే గుర్తుకొస్తుంది. దానికున్న నలుపు దానికి తెలియదు.

**మాట్లాడటంలో తీరు, తెన్ను ఉండాలి :** ఊరి వారిదొక త్రోవ, ఉలిపి కట్టె దొక త్రోవ' అన్నట్లు కాకుండా, జనంతో కలుపుగోలుతనంగా ఉంటే, వారు తినబోయే అన్నమైనా తీసిపెడతారు. కలహశీలునకు ఎప్పుడు కష్టాలు నష్టాలు తప్పవు. అర్థం ఒకటే అయినా మాట్లాడే విధానంలో తీరు తెన్ను ఉండాలి. 'మీ నాన్నగారు ఉన్నారా? అన్నదానికి మీ అమ్మ మొగుడు ఉన్నాడా ? అన్నదానికి ఎంతో తేడా ఉంది. మా అమ్మ, మా అక్క అంటే 'మనవాడే' అని అక్కున చేర్చుకొని, ఆదరిస్తారు. నీ యమ్మ, నీ యక్క అంటే .నీ మాయరోగం ఇట్లా ఉందా?' అని చెప్పులతో, చీపురులతోకొట్టి చీదరించుకొంటారు.

**గుణాన్ని దోషంగా చెప్పటమే అసూయ :** ఇతరుల పచ్చతనాన్ని చూచి ఓర్చలేనివారు అసూయతో గుణాన్ని దోషంగా అభివర్ణస్తారు. అందు వల్ల వారికి జరిగే అపకారం సంగతి అలా ఉంచినప్పటికి, కట్టెనున్న నిప్పు కట్టెనే కాల్చినట్లు అసూయాపరుల ఆరోగ్యానికే అది హానికరం. పంచవటిలో ఉండగా శూర్పణఖ జగదేక సుందరియైన సీత అందాన్ని రాముని ముందే అందవికారంగా చిత్రించి వర్ణించింది. అది శూర్పణఖ చుప్పనాతి తనాన్ని నిరూపిస్తుంది. సీతను చంపి అడ్డు తొలగించుకోబోయి చివరకు ముక్కు చెవులు కోయబడి, ఆమె దుర్బుద్ధికి తగిన ప్రతిఫలం అనుభవించింది. మారీచుని ఆశ్రమంలో రావణుడు రాముని సుగణాలను దుర్గుణాలుగా వర్ణించాడు. బలాన్ని దుర్బలంగా భావించాడు. దురహంకారంతో కూడిన అతని నిర్లక్ష్యవైఖరికి తగిన దుష్ఫలితాన్ని పొందాడు. సపరివారంగా నశించాడు.

**తిట్టేనోరు-తిరిగే కాలు ఊరుకోవు :** సందు దొరికనప్పుడల్లా ఇతరులను గూర్చి నోరు జారటం, కోపంతో చిందులు త్రొక్కటం కుసంస్కార లక్షణం. మనసు, మాట అదుపు తప్పటం వలన చివరి కతడు పిచ్చివాడై పరిహాసాల పాలవుతాడు.



(చందోలు) గారు చెప్పారు. అనుభవంలో కూడ అది సత్యమని నిరూపింపబడింది. వారి చల్లని దీవెనలే అర్థుల పాలిటి వరములై, పామరులు సహితం పండితులైన సందర్భాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. ఇందులో అతిశయోక్తి ఏ మాత్రం లేనేలేదు. అందుకే లోకంలో మహాత్ముల మాటకు తిరుగు లేదని కాళిదాసు వక్కాణించాడు. నహీశ్వరః వ్యాహృతయః కదాచిత్, పుష్ణంతిలోకే విపరీత మర్థమ్।। (కు.సం.) శాపానుగ్రహ సమర్థులైన ఇటువంటి వారినిగూర్చి తెలియజేస్తూనే 'పశుపతి కంటి మంటయును, పండిత వాక్యమురిత్తవోవునే.' అని అంటాడు వేములవాడ భీమకవి. దివ్యమైన అతని చరిత్ర కూడా ఇందుకు ఒక ఉదాహరణంగానే పరిగణింపదగి ఉంది. లోకంలో సాధువర్తనులైన మహాత్ములు జరిగే దాన్ని బట్టి ఆలోచించిమాట్లాడుతారు. ఆద్యులైన ఋషుల విషయంలో అయితే, వారి వాక్కునే ప్రయోజనం అనుసరిస్తుంది. అంటే వారేది (పలికితే) సంకల్పిస్తే అది జరిగి తీరుతుందని అర్థము.

**మాట చెప్పి పుణ్యం కట్టుకో :** రాక్షస రాజ్యమైన లంకలో నిర్బంధింపఁబడిన సీత, రామ దూతయై వచ్చిన హనుమంతునితో 'నాయనా! నీవు ఏ విధంగాచెప్తే రాముడు నన్నీ చెఱ నుండి తప్పించి, కష్టాల కడలి నుండి కడఁదేర్చి జీవితాన్ని కాపాడుతాడో ఆ విధమైన మాట చెప్పి తనకు సాయపడమని కోరింది. 'వాచా ధర్మమవాప్నుహి'. అందుకు తగినట్లుగా హనుమంతుడు రామునితో సీతఁగూర్చి చెప్తూ, రామచంద్రా! 'సీత క్షేమంగా ఉంది. నీరాకకై వేయి కనులతో ఆమె ఎదురు చూస్తోంది' అని విన్నవించాడు. అది విన్న రాముడు ' కట్టె, కొట్టె, తెచ్చె' అన్నట్లు వారధి నిర్మించి, రావణుని సంహరించి సీతను బరిగ్రహించి అయోధ్యచేరి పట్టాభిషిక్తుడై ప్రజారంజకంగా పరిపాలన సాగించాడు. ఆ విధంగా హనుమంతుని మాట సీతాశోకవినాశకమగుచు రావణ సంహార రూపమైన జగత్కల్యాణానికి కారణమైంది. ఆలోచిస్తే మాట కెంత బలం ఉందో ఇందు మూలంగా మనకు తెలుస్తుంది.

**పరోపకారమే పుణ్యము :** పరులకు ఉపకరించే మాట మాట్లాడటం పుణ్యమని, హాని కలిగించే మాట మాట్లాడటం పాపమని, కోటి గ్రంథముల సారము క్లుప్తంగా

ఇదే' అని ఒక మహాకవి వివరించాడు. మను చరిత్రలో ప్రవరుడు వరూధినిని 'జలజాక్షి! యెఱిగితేని నగర మార్గంబుఁజూపి పుణ్యమునఁ బొమ్ము! (2/59) అని ప్రార్థించాడు. దీనిని బట్టి ఇతరులకు ఉపయోగించేమాట. మాట్లాడాలని, లేకపోతే మౌనం వహించడమే మేలని అర్థమవుతుంది.

దిక్కులేనివారికి దేవుడే దిక్కుఅన్నట్లు పొన్నూరులో దీనుడైన గూనిగోవిందుని వివాహానికి సాక్ష్యం చెప్పటం కొఱకు, 'శ్రమ అని' కూడా, అనుకోకుండా శ్రీ భావనారాయణస్వామి, విశ్వేశ్వరుని కూడ, వెంట బెట్టుకొని, కాశి నుండి ఇక్కడకువచ్చి, నడుము కట్టుకొని నిలబడి, ఆ శుభకార్యం నిర్వహించాడు. పరమాత్ముడే గోవిందునికి పరమ ఆప్తుడయ్యాడు. పరహిత చింతనలో కూడా పరమాత్ముడే లోకానికి ఆదర్శంగా నిలిచాడు. అద్దంచూచి ముఖం దిద్దుకొన్నట్లుగా, భగవంతుని జూచి మనం బ్రతుకు దిద్దుకోవాలి.

**ఉచితజ్ఞత ఉండాలి :** లోక వ్యవహారంలో మాటకెంతో మహిమ ఉంది. ఒకప్పుడది పోయేప్రాణాల్ని నిలుపుతుంది. అదుపు తప్పితే ఒకొక్కప్పుడు అదే ప్రాణాల్ని తీస్తుంది కూడా.

రావణునిచే అపహరింపబడి, లంకలో నిర్బంధింపబడిన, సీత రామ వియోగాన్ని, రాక్షసుల దురాలాపములను భరింపలేక' జీవితంపై విరక్తిచెంది, ప్రాణాలు పరిత్యజించటానికి ప్రయత్నించింది. ఆ సమయంలో, సీతాన్వేషణ నిమిత్తం రామదూతయై అచటకు చేరిన హనుమంతుఁడది చూచి, సమయోచిత ప్రజ్ఞతో సీతకప్పుడు కలిగిన ఉద్వేగం ఉపశమించి, మనస్సు తేటపడి, హృదయం ఊరటపొందే విధంగా శుభములు, ధర్మయుక్తములు, మధురములు ఐన వాక్కులలో ఆమెకు మిక్కిలి ఇష్టమైన రామకథావర్ణన చేసి ఏ ప్రమాదం జరగకుండా కాపాడగలిగాడు. జానకీశోక వినాశకుడన్న ప్రశంస లందు కొన్నాడు. రావణ సంహారానంతరం ఆ సీత రామునితోగూడి రత్న సింహాసనంపై కూర్చుండి పట్టాభిషేక వైభవాన్ని అనుభవించి, జగదేక - ఆరాధ్యయై వర్ధిల్లింది. హనుమంతుడు సీత జాడచూచి రావడము మాత్రమే తన బాధ్యతగా భావించి, ఆమెను పలుకరించి, ధైర్య వచనములు పలుక కుండా వచ్చినట్లైతే, తిరిగి ఏప్రమాదం



శ్లో॥ తద్దివ్య మవ్యయంధామ, సారస్వతముపాస్మహే ।
యత్ప్రసాదా త్ప్రలీయన్తే, మోహాంధతమసచ్ఛటాః ॥

**మంచిని స్వీకరించే సహృదయతను పెంపొందించుకోవాలి :** సు + ఉక్తి = సూక్తి అంటే మంచి మాట అని అర్థం. విజ్ఞానాన్ని పంచి యిచ్చేవి, సంభాషణకు వన్నె తెచ్చేవి సూక్తులు. సుభాషితాలు. 'ఎవరి ఇష్టం వారిదనుకొంటున్న ఈ రోజుల్లో మంచి మాటలు ఎవరు వింటారు? పండితులకు అసూయ మెండు. ప్రభువులా అధికార దుర్మదాంధులు. తక్కినవారు అజ్ఞాన నిధులు. ఆ జనానికి ఇవేమీ పట్టవు. ఇంక ఎవరికి చెప్పేందుకీ సుభాషితాలు? నాలోనే ఇంకి పోనిమ్మ'ని వాపోయాడు ఆనాడు భర్తృహరి. ఆనాటి సమాజంలోనే కాదు ఈనాటికీ అదే స్థితి కొనసాగుతోంది. సాంఘిక వ్యవస్థలో మార్పు వస్తేగాని ఆలోచనా విధానంలోను, ఆచరణ పద్ధతిలోను, ప్రగతి సాధింపబడదు.

**ఇతరులమాట వినే సహనం అలవర్చు కోవాలి :** కొందఱు ఎంత సేపటికీ ఎదుటివారికి మంచి చెప్తున్నామనే ధోరణిలోనే మాట్లాడుతారుకానీ, తిరిగి వారు చెప్పినప్పుడు, ఆ చెప్పింది యథార్థమే అయినప్పటికి, సహనంతో వినటానికి ఇష్టపడరు. ఆచరించటానికి ముందుకురారు.

**నోరు పలుకరిస్తుంది - నొసలు వెక్కిరిస్తాయి :** సమాజంలో కొందరు ఎందుకో ఎప్పుడూ వెటకారంగా మాట్లాడతారు. అది వారినైజమో, ఎదుటివారిని గూర్చి వెక్కిరించటమో అర్థం కాదు. అవసారానికి పొగడటం, ఆ తర్వాత తిట్టడం, కడుపులో అనురాగం లేకుండానే కనబడ్డప్పుడు కౌగిలించుకోవటం మఱికొందరి వంచనా శీలానికి నిదర్శనం.

**తప్పులెన్నువారు తమ తప్పు లెఱుగరు :** తప్పు చెయ్యటం మానవత్వం, క్షమించటం దైవత్వం' అంటారు. మనసు నొచ్చుకోని విధంగా ఎదుటి వారిలోని తప్పు సరిదిద్దటం నేరమేమీకాదు. వారి సంస్కరణాభిలాషకు శత సహస్ర నమస్కారాలు. ఇతరులను వేధించి, తాము సంతోషిస్తారు కొందరు. హాయిగా నవ్వుతూ ఆడుకొంటున్న, చిన్న పిల్లలను గిల్లి, ఏడిపించి, ఆనందించటం ఆ కోవలోకే చేరుతుంది. అది ఒక మానసిక వ్యాధి. దానినే వైద్య పరిభాషలో 'శాడిజమ్' అంటారు. ఆవ్యాధి ముదిరితే ఇక మందే లేదు.

రామాయణంలో, పంచవటియందున్న సీతను, అపహరించాలని వచ్చిన రావణునితో, మారీచుడు నీ కది మంచిది కాదని, ఆ ఉద్దేశం మానుకొమ్మని చెప్పాడు. రావణుడు ఆ మాటలు వినకపోగా మారీచుని చంపటానికి పూనుకొన్నాడు. మూర్ఖులకు మంచి చెప్పటం, పాములకు పాలు పోసినట్లు అవుతుంది. ఫలితం, కోప విష ప్రయోగం. “సులభాపురుషారాజన్। సతతం ప్రియవాదినః। అప్రియస్యచ పథ్యస్య, వక్తాశ్రోతాచ దుర్లభః।।” అంటాడు వాల్మీకి.

**మంచి మాటలు ఉపేక్షించరాదు :** భారతంలో సంజయుడు కౌరవ రాయబారిగా పాండవుల వద్దకు వెళ్ళి, బాధ్యతతో వారు చెప్పమన్న మాటలు చెప్పాడు. కానీ తిరిగివచ్చి తన కర్తవ్యంగా ధృతరాష్ట్రుని తప్పిదాన్నీ తెలియజెప్పాడు. ఆ సంజయుని మాటలు మనోహరంగా లేకపాయినా, హితకరములనే విషయం ఆ కౌరవపతి గ్రహింప లేక పోయాడు. ప్రభువుగా, శాసించగల అవకాశం ఉండీ ధర్మాన్ని అచరింపలేక పోయాడు. అంటే అప్పటికి ధృతరాష్ట్రుడు భౌతికంగానే కాదు, పుత్ర మమకారంతో మానసికంగా కూడా, గ్రుడ్డివాడు అయిపోయాడన్నమాట. అతని ఉపేక్షావైఖరి, వంశనాశనానికి దారి తీసింది. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమే తగిన ఫలితాన్ని ప్రకటించింది.

ఇంక ఈనాటి సాహిత్య ప్రపంచంలోను ఇదే దుస్థితి సంభవించింది. కలలలో విహరించటం, కల్పనలకే మనస్సులో స్థానం కల్పించటం అలవాటుపడిన ఈ లోకంలో రచయితలు కొందఱు అశ్లీల సాహిత్యాన్ని సృష్టించి, సమాజాన్ని, అందునా యువతరాన్ని పెడత్రోవ పట్టిస్తున్నారు. ధార్మికత్వాన్ని భంగపరిచే ఆ రచనలు ప్రియమైనవిగాతోచి ప్రజలను విశేషంగా ఆకర్షిస్తూ, కామక్రోధాదులను రెచ్చగొట్టి, ఇంద్రియ చాపల్యాన్ని ప్రోత్సహిస్తున్నాయి. నీతి నియమాలను చెడగొట్టున్నాయి. జాతి గౌరవాన్ని కించపరుస్తున్నాయి. సమాజం సుఖశాంతులతో వర్థిల్లటానికి తగిన, సంస్కార యుక్తమైన సాహిత్య సంపదను అందించి వ్యామోహమనే చీకట్లని పారద్రోలి, విజ్ఞాన జ్యోతులను ప్రసాదించే ఉత్తమ సాహిత్యం అధ్యయనం చేయటం జాతి మనుగడకు దోహదపడుతుంది. అందుకు కవులు, రచయితలు దీక్ష వహించాలి పాఠక ప్రజలు సహకరించాలి.



సంభవించి ఉండేదో కూడా ఊహించలేం. అక్కడే ఉంది ఆ కార్యశూరుని ఉచితజ్ఞత.

కురుక్షేత్ర యుద్ధంలో నరుని మనోదౌర్బల్యాన్ని పోగొట్టే విధంగా, లోక పరమార్థాన్ని వివరించి, నీకుతోడు నేనున్నానని చెప్పిన శ్రీ కృష్ణుని గీతా వాక్యాలు అభయ ప్రదములై అతని మోహాన్ని పారద్రోలి, విజ్ఞానాన్ని ప్రసాదించి. కర్తవ్యోన్ముఖుని చేసాయి. విజయ సిద్ధికి దోహదపడ్డాయి. నరుని, విజయునిగా చేయుటే గీతా బోధనలోని రహస్యం. అదును, పదును తెలిసి వ్యవసాయం చేసినపుడు సత్ఫలితం తప్పక లభిస్తుంది. సమయం సందర్భం తెలుసుకొని సరియైన మాట మాట్లాడితే కార్యసాధన జరుగుతుంది. దీనినే అనుభవజ్ఞులు ‘కీలెఱిగి వాత పెట్టడం’ అంటారు. కొందఱు ఎదుటి వారితో అనునయంగా మాట్లాడి పని చేయిస్తారు. కొందరు ఇతరులలో అభిమానాన్ని కలిగించి, ఆత్మశక్తిని ప్రేరేపించి, పని సాధిస్తారు.

**ఎప్పుడెలా మాట్లాడాలి :** పూజ్యులైన పెద్దల యందు గౌరవం, వినయంతో కూడిన మాటలే మాట్లాడాలి. చిన్నవారి యందు వాత్సల్యం, అభిమానం కలిగి ఉండాలి. విరోధి ఎదురైనప్పుడు ధైర్యంగా, పౌరుషం ఉట్టిపడేలా మాట్లాడాలి. ఇంక ఆ యా సందర్భాలలో తగిన విధంగా మాట్లాడటం ఉత్తముల లక్షణం. హనుమంతుడు, సీతతో మాట్లాడినప్పుడు వినయంగాను, శత్రుసైన్యం ఎదురుపడినప్పుడు వీరోచితం గాను, రావణునితో మాట్లాడేటప్పుడు ధైర్యం గాను, రామునితో మాట్లాడేటప్పుడు భయ భక్తులతోను మాట్లాడటం గమనించగలం.

**ఎక్కడేది మాట్లాడాలి :** పిడుగుకు, బియ్యానికి ఒకే మంత్రం పనికిరాదని, వివాహానికి, వియోగానికి ఒకే సూత్రం కట్ట కూడదని పెద్దలంటారు. అలాగే ఎక్కడేది మాట్లాడాలో చక్కగా తెలుసుకొని మాట్లాడటం వివేకవంతుల లక్షణం. హనుమంతుడు సీతను సందర్శించి, రావణుని హెచ్చరించి, లంకను దహించి, తిరిగివచ్చి, సముద్రతీరంలో ఉన్న వానరవీరులతో తన పరాక్రమ విశేషాలను గురించి వివరించాడు. అందఱు... కలిసి తమ ప్రభుని సన్నిధికిచేరి, రామునితో ఆ వివరాలు చెప్పేటప్పుడు సీత గుర్తుగా ఇచ్చిన శిరోమాణిక్యాన్ని అతని కందించి,

ఆమె సందేశాన్ని వినిపించి, సీత చెప్పిన చిత్ర కూటంలో జరిగిన ఒకనాటి సంగతి (కాకాసుర వృత్తాంతం)......... వెల్లడించాడు. అతడు వానర వీరులతో చెప్పిన తన పరాక్రమాదులను రాముని సన్నిధితో....... వర్ణింపలేదు. రాముని సమక్షంలో వివరించిన సీతా సందేశము మొదలైనవి వానరులకు వినిపించలేదు. ఎవరి దగ్గఱ ఎంత వఱకు ఏ విషయం మాట్లాడితే ఉచితమో ఎఱిగి, వారికి సంతోషాన్ని కలిగించే విధంగా ఆ విషయాలే మాట్లాడిన మతిమంతుడు హనుమంతుడు. తల్లితో చెప్పేమాటలు తల్లికి, భార్యతో చెప్పేమాటలు భార్యకు చెప్పాలి. తారుమారైతే కొంపలంటుకుపోతాయి. మరో ప్రళయం ఏర్పడుతుంది.

**వాక్ సంయమనం ఎంతో అవసరం :** ఏ సందర్భంలోనైనా మాట్లాడేటప్పుడు సంయమనం పాటించటం చాలా ముఖ్యం. నోటి నుండి వెలువడిన మాట ధనస్సున సంధించి విడిచిన బాణం వంటిది. అది లక్ష్యమును చేరటంలో అనుమానం లేదు. దాని వల్ల వచ్చే ఫలితం (మంచి, చెడు) అనుభవించి, తీరాల్సిందే. ఈ విషయాన్నే పెద్దలు 'కాలు జారితే తీసుకోవచ్చు, నోరజారితే తీసుకోవటం కష్టం' అంటారు. అందుకే ముందుగా ఆలోచించి ఔచిత్య సుందరంగా మాట్లాడటం అలవర్చు కోవాలి. 'పెదవి దాటితే పృథివి దాటుతుంది' అన్నట్లు ఏదైనా ఒక విషయం రహస్యమనీ, ఇంకెవ్వరికీ చెప్పవద్దని, ఏ ఒక్కరితో చెప్పినా, అది క్రమంగా లోకమంతా తిరిగి, చెప్పినవారి దగ్గఱకే అది అతి రహస్యంగా వచ్చి చేరుతుంది.

**సంభాషణకు చమత్కారమే సొగసు :** పాయసంలో జీడిపప్పులవలె, మాటలలో చమత్కారం మఱింత మాధుర్యాన్ని చేకూరుస్తుంది. ఉప్పులేని కూర చప్పగా ఉన్నట్లు అది ఎంతటి విద్యావిశేషమైనా సరసతను కోల్పోయినప్పుడు నీరసంగా తోస్తుంది. నిరర్ధకమనిపిస్తుంది, వాసన లేని పువ్వువలె పరిహాస ప్రసంగంలేని వాక్యము కొఱగానిదని చెప్పారు కవులు – అందుకే సున్నితమైన హాస్యంగల ప్రహసన కావ్యరచనలు కూడ చాలా ప్రసిద్ధికెక్కాయి.

**చమత్కృతి సుందరమై మనోరంజకమైనది మాట :** రసరమ్యమైన ఊహలకు ఊపిరిపోసేది మాట. అది మనసును మురిపిస్తుంది. తనువును మరిపిస్తుంది. అట్టి వాక్కులే, కర్ణామృతాలు. మనస్సుకు రసాయనాలు అవుతాయి. కవికోకిలల



వివాదాస్పదంగా నిలిచిపోతారు. వాచాలులైన వారు చేసే అధిక ప్రసంగంవల్ల మాటలలో పొల్లువచ్చి చేరుతుంది. కల్ల మాటలు చోటుచేసుకొంటాయి. అందువల్ల అతిశయోక్తులు అనవసర ప్రసంగాలు మాని మితంగా మాట్లాడటం అలవాటు చేసుకోవాలి. రఘువంశ రాజుల చరిత్ర వర్ణిస్తూ కాళిదాసు, 'వారు సత్యం కొఱకు తక్కువగా మాట్లాడేవార'ని తెలియజేశాడు 'సత్యాయ మితభాషిణాం'.

**తాము పట్టిన కుందేటికి మూడే కాళ్ళు :** కొందఱికి పుడుతూ వచ్చిన బుద్ధులు పుడకలతోనే పోతాయి కానీ, మధ్యలో మారవు. వారు ఎదుటివారి మాటలను చెవి చొరనీయరు. అటువంటి వారు 'తాము పట్టిన కుందేటికి ముడే కాళ్ళని వాదిస్తారు. అది మూర్ఖుల పద్ధతి. 'అట్టివారిని రంజింపజేయటం సాధ్యంకాదు' అన్నాడు భర్తృహరి. అట్టివారు చెబితే వినరు, గిల్లితే ఏడుస్తారు.

**మిడిమిడి జ్ఞానం, ప్రమాదాలకు కారణం :** కొందఱు తమకు అన్నీ తెలిసినట్లు మాట్లాడుతారు. ఎందులోనూ ప్రావీణ్యం ఉండదు. అట్టివారు ఎప్పుడు తమ మాటేనెగ్గాలని చూస్తారు. 'క్రిదపద్దా, మాదే పైచేయి' అంటారు. తా మెచ్చింది రంభ, తా మునిగింది గంగ' అని వారి ఉద్దేశం. ఇలా తెలిసీ, తెలియనివారి కొకమాట చెప్పి, ఒప్పించటం ఇతరులకు చేతకాదు సరే, వారిని పుట్టించిన బ్రహ్మదేవునికి కూడా చేతకాదు. భ్రాంతి పడినవాడు తాను నమ్మిన అసత్యాన్నే సత్యమని వాదిస్తాడు. పంతం నెగ్గించుకోవటానికి ప్రయత్నిస్తాడు. అందుకొక ప్రమాణం అంటూ ఉండదు.

**హితం మనోహారిచ దుర్లభం వచః :** హితము, మనోహరము అయిన మాటలు దొరకటం అరుదు. ముఖ ప్రీతికై ఇచ్చకములాడేవారు ఎక్కడైనా, ఎప్పుడైనా సులభంగానే లభిస్తారు. వారు ప్రియవాదులేకాని యథార్థాన్ని వివరంగా బోధించేవారు కారు. 'ఎవరెటు పోతే మనకేమిటి మన పని జరిగితే చాలనుకొనేవారు, వారు ఎవరితో ఏమంటే, ఎక్కడ, ఏ తగాదా వస్తుందో? మన కెందుకులే' అని భయపడేవారు కూడా ఉంటారు. అందువల్ల వినటానికి అప్రియమైనా, హితము చేకూర్చే మాట చెప్పేవారే నిజమైన మిత్రులు. లోకంలో అట్టి వారు లేరు. ఒక వేళ ఎవరైనా సాహసించి చెప్పినా, వినేవారూ లేరు.

పాలిటి కల్పవల్లి. లక్ష్మీదేవి వస్తుంటే ఇల్లు కళకళ లాడటం అనుభవ సిద్ధమైన విషయమే కదా! అయితే తీర్పు చెప్పటంలో గల నేర్పు అతనికి అదృష్టాన్ని తెచ్చి పెట్టింది. ఇంక, సమయాన్ని, సందర్భాన్ని బట్టి, కార్యసాధనలో భాగంగా అవసరమైతే ఎంకిని, వెంకమ్మ అని అనవల్సి వస్తుంది. అది తప్పేమీ కాదు, మాట తీరులో మనకు కలిగే ప్రయోజనం ఎటువంటిదో అది తెలియజేస్తుంది. పోరునష్టము, పొందులాభము అనే పెద్దలమాట విన్నాం కదా !

**అమంగళం పలుకరాదు :** ఒక విషయాన్ని చెప్పటంలో అశ్లీలాన్ని, అమంగళాన్ని పరిహరించి చెప్పటం ఒక విశేషంగా గమనిస్తాం. ఇంట్లో బియ్యం అయిపోయాయని చెప్పటానికి 'నిండుకొన్నాయి' అని, ఫలానా వారు మరణించారని అంటానికి 'కాలం చేశార'ని పెద్దలు అనటం వింటూ ఉంటాం. గాజులు చిట్లాయి-నల్లపూసలు పెరిగాయి అని చెప్పాలి. నెయ్యి లేదంటానికి ఆజ్యం, పూజ్యం అనాలి. శుభకార్యాలు ఏమీ క్రొత్తగా తలపెట్టి చేయకూడదని చెప్పటం కోసం వారాల్లో ఒక వారానికి 'మంగళవార'మని పేరుపెట్టారు.

**పారిభాషిక పదజాలాలు :** వృత్తినిబట్టి, వ్యక్తులనుబట్టి ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క పరిభాషా పదం వాడటం జరుగుతుంది. అది ఆ వర్గం వారి వఱకే పరిమితమై రహస్య గోపనానికి ఉపయోగ పడుతుంది. ఏదో సందర్భంగా యజమాని పండితులకు ఒక్కొక్కరికి 10 రూపాయలు చొప్పున సంభావన ఇచ్చాడన్నది 'దశావతారాలు' అన్న మాటలో ప్రకటించ బడుతుంది. అదే 11 ఐతే రుద్రులు అనీ, 12 ఐతే ఆదిత్యులు అని, వ్యవహరిస్తారు. ఒక ఊళ్లో ఒక వ్యాపారి, ఇంట్లో ఉన్నది ఒకే అమ్మాయి అయినా, ద్రవ్యం తాను తీసుకొనేటప్పుడు 'పెద్దమ్మాయి! మానికతేవే' అని, ఇచ్చేటప్పుడు చిన్నమ్మాయీ అని సంబోధించే వాడట. ఇందులో రహస్యం ఆవిషయంతో పరిచయమున్న వారికి తప్పితే అందఱికి తెలిసేది కాదు. అంటే తాను కొనేటప్పుడు పెద్దది, ఇతరులకు ఇచ్చేటప్పుడు చిన్నదిగా ఉన్న కొలపాత్రలు వాడే వారని అర్థం.

**మితంగా మాట్లాడాలి :** ఏ విషయాన్ని గుఱించి అయినా ఎక్కువగా మాట్లాడరాదు. కొందరు ఆవిధంగా మాట్లాడటం చేత అనేక ప్రమాదాలకు గుఱి అవుతారు.



మధురాలాపములే కావ్యనందన వనములకు సుందరమగు వసంత శోభలను వెలయింప చేస్తాయి అక్షరము లేక అక్షర సముదాయము పదము. (మాట) పదసముదాయము వాక్యము. వాక్యసముదాయము కావ్యము. దీనినే మహా వాక్యమని అంటారు. సాహిత్యవేత్తలైన ఆలంకారికులు రసమయమైన వాక్యమునే కావ్యంగా పేర్కొన్నారు. 'వాక్యంరసాత్మకం కావ్యమ్,' విశ్వశ్రేయమే కావ్య ప్రయోజనంగా పరిగణించారు. 'విశ్వశ్రేయఃకావ్యమ్'. రమణీయార్థ ప్రతిపాదక సమర్థములగు శబ్దముల ద్వారా కవులు నవరసములను అనుభవింప చేస్తున్నారు. కవి అభిరుచినిబట్టి కావ్యంలో శృంగార, హాస్య, కరుణాది రసములు ప్రాధాన్యతను సంతరించుకొంటున్నాయి. కవిబ్రహ్మ సంకల్పమే కావ్యము.

**ప్రణయానికైనా, ప్రళయానికైనా మాటే ఆధారము :** ప్రపంచంలో వాక్కుకున్న శక్తి మరిదేనికి లేదు. ప్రేమికులలో ఒకరు అభిమాన పూర్వకంగా 'నిన్ను నేను ప్రేమిస్తున్నాను' అని అన్న మాటలు రెండవ వారి హృదయంలో స్పందనలు సృష్టించి,అనురాగపు వెల్లువలై, ప్రణయానికి దారితీస్తాయి. రాజ్యాలు, భోగభాగ్యాలు దాని ముందు బలాదూర్‌గానే భావింపబడతాయి. ఆ ప్రేమైక జీవులకు ప్రాణాలు కూడా తృణ ప్రాయాలే అయిపోతాయి. మనస్సులో భేద మేర్పడి, మాటల వలన అభిమానం దెబ్బతింటే, ప్రాణమిత్రులు బద్ధ శత్రువులుగా మారిపోతారు. వారి మధ్య అలజడి ఏర్పడి ప్రళయం సృష్టింపబడుతుంది. వారి నడుమ పచ్చ గడ్డివేస్తే భగ్గు మంటుంది. ప్రతిమాటా ఒక ఆటమ్ బాంబులా పేలుతుంది. అగ్గిమీది గుగ్గిలం, నిప్పుమీద ఉప్పు పడ్డట్టు అవుతుంది. ఆ ఇంటి మీద కాకి యీ ఇంటి మీద వాలటానికి వీలులేని పరిస్థితి ఏర్పడుతుంది. చివరకు అస్త్రం పట్టించే శక్తి, పట్టిన అస్త్రం విడిపించే శక్తి ఒక్క మాటకే ఉంది. భారతంలో ఉదంకుని మాట ప్రేరణయై జనమేజయుని చేత సర్పయాగం చేయించింది. అస్తీకుని ప్రబోధములు ఆ ప్రయత్నమును విరమించటానికి దోహదం చేశాయి. దీనిని బట్టి మాటకు గల ప్రభావ మేమిటో ప్రకటితమవుతుంది. ఒకొక్కప్పుడు మాటయే జాతిజీవనానికి, గౌరవానికి కారణమవుతుంది. ఒక్క సూక్తి, వ్యక్తిత్వ వికాసానికి, విద్యాప్రణాళికకు మార్గదర్శకంగా నిలుస్తుంది.

**తాకేది, తప్పేది తెలియకమాట్లాడరాదు :** ఒకప్పుడు తను పొరపాటుగా మాట్లాడేమాటలు, వికటించి, తనవారికి (కులము, వంశము) ప్రమాదాన్ని తెచ్చిపెడతాయి. కుటుంబంలోనూ అదే పరిస్థితి ఏర్పడి, చివరకు ఒంటరి వాడిని చేసేస్తాయి.

ఉదా॥ వియ్యపురాలు కుత్సితబుద్ధితో చేసే వికృత చేష్టల్ని, ఎదుటపడి అడిగితే సరిగా సమాధానం చెప్పకపోగా, పగబట్టి దురహంకారంతో కూతురు కాపురంమీద దెబ్బతీస్తుంది. కొద్ది కష్టమనిపించినా, దుఃఖాన్ని దిగమ్రింగి, ఓర్పుతో మెలిగితే ముందు ముందు, మంచిరోజులు వస్తాయి. నిలదీసిన వారి కుటుంబాలకు ఆ సెగతగుల్తుంది. కోడలిని తిడితే కొడుకు కాపురం కొల్లేరై పోతుంది. అనునయవాక్యాలతో నచ్చచెప్పుకోవటం మంచిది. గృహిణితో కలహం ప్రత్యక్ష నరకం.

ఒకప్పుడు, మనకు వచ్చి తీరుతుందన్న, ఉద్యోగమో, ఉన్నతస్థితో (ప్రమోషన్) భూమో, ధనమో, ఇంకేదో వస్తువో, అది ఏదైనాసరే, ఆశించినవారి విపరీత ధోరణిని బట్టి దక్కకుండా పోవచ్చు. తెలివితక్కువ తనంతో, విసుగు పుట్టించే విధంగా మాట్లాడితే, ఉన్న అభిమానం కాస్తా పోతుంది. ఆసందర్భంలో పెద్దవారు, చదువుకున్న వారనే గౌరవంకూడా మిగలదు. మాటకెంత పదునున్నదో నిత్యజీవితంలో అందటికి తెలిసిందే. అజాగ్రత్తగా వాడితే స్నేహ సంబంధాలు కూడా తెగిపోతాయి.

ఆడది అబల. అనుభవించే వస్తువు. బిడ్డలను కనిపెంచే యంత్రము. అని ఆమెను కాపురానికి వచ్చిన కొత్తలో ఈటెలవంటి మాటలతో హింసిస్తే కాలంగడిచిన కొద్దీ, బలం, బలగం (సంతానం) ఏర్పడి, తిరగబడి తనను బాధించిన వారిపట్ల సింహస్వప్నమై వ్యవహరిస్తుంది. ప్రతీకారం తీర్చుకుంటుంది. ఆమె కూడా మనిషి. ఆమెకొక మనసుంటుందని తెలిసి, గౌరవించటం, కలిసి మెలగటం మర్చిపోకూడదు. లేకపోతే, కుటుంబాలు ఛిన్నాభిన్నమైపోతాయి. బంతిని, ఎంతబలంగా క్రిందికి అదిమితే, అది అంత బలంగానూ పైకి ఎగిరినట్లు, అణగత్రొక్కబడినవారు ఎదురు తిరుగారు – ఇంతకూ, మాట, ఎంతటి పరిస్థితినైనా



**పెద్దలతో పరిహాస మాడరాదు :** కొందటికి హాస్యం అంటే ఇష్టం. అటువంటి వారు ఎవరినో ఏదో ఒక మాట అంటూ, ఆట పట్టిస్తూ, నవ్వుతూ నవ్విస్తూ ఉంటారు. నవ్వితే ఆరోగ్యమే అని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు కాబట్టి బాగనే ఉంటుంది. వరుస కలిసిన వారితో, సమ వయస్కులతోను అయితే ఫరవాలేదు కానీ, వారు పెద్దలైన తల్లిదండ్రులతోను, పూజ్యులైన గురువులతోను అదే ధోరణిలో ప్రవర్తిస్తారు. అప్పుడది అపహాస్యంగా మారుతుంది. అందుకు వారు నొచ్చుకొని, మనసులో తిట్టుకొన్నా అది అంత క్షేమదాయకం కాదు. అందువల్ల వారి విషయంలో స్వాతిశయం మాని వినయంగామాట్లాడాలి. వినమ్రతతో ప్రవర్తించాలి.

**పిల్లలలో అనుకరణ శీలం ఎక్కువ :** చిన్న పిల్లలు తమ చుట్టూ వాతావరణాన్ని జాగ్రత్తగా గమనిస్తూ, ప్రతి విషయం అనుకరించటానికి ప్రయత్నిస్తారు. మాటతీరు, అభినయక్రమం ఇట్టే పట్టేస్తారు. వారి మనస్సులపై పెద్దవాళ్ళు చెప్పుకొనే మాటలయొక్క, చేసే చేష్టలయొక్క ప్రభావం తప్పకుండా ఉంటుంది. 'వాళ్ళకు తెలియదులే' అనో 'ఆః, ఉంటే ఉన్నారులే, వింటే విన్నారులే' అనో పెద్దలు తమ ఇష్టం వచ్చినట్లుగా వ్యవహరించరాదు.

**మాట నేర్పు కావాలి :** మనిషికి మాట నేర్పు చాలా అవసరం. అది లేని వారు జీవితంలో ఆపదల పాలుకాక తప్పదు. ఒకప్పుడు దరిద్ర దేవత పెద్దమ్మకు, లక్ష్మీదేవి చిన్నమ్మకు తమలో ఎవరు అందంగా ఉంటారనేది చర్చనీయాంశమైంది. ఊళ్ళో ఎవరి నడిగినా వారు ' ఏమంటే ఏమి ప్రమాదమో' అని మాకు తెలియదంటే మాకు తెలియదని ఏమీ చెప్పకుండా తప్పుకొంటున్నారు. తర్వాత, ఒక యుక్తిపరుని దగ్గఅకువచ్చి, వారు తమతమ వాదాలను వినిపించి, తీర్పు చెప్పమని కోరారు. ఆయన నేర్పుగా వారిని అటు, ఇటు నడిపించి, చివరకు, పెద్దమ్మ వెళ్తుంటేను, చిన్నమ్మ వస్తుంటేను, బాగుంటుందని ప్రకటించాడు. ఆ మాటలు విని, ఒప్పుకొని ఎవరికి వారు సంతోషంతో ఆయనకు దండిగా వరాలు ప్రసాదించారు. దాంతో అతని పంట పండింది. మాట వలన మన్ననతోబాటు, సంపదలు కూడా సంభవిస్తాయి.

నిజానికి ఇనుపగజ్జెలపెద్దమ్మ, వెళ్తుంటే దారిద్ర్యం తొలగిపోవటం, అర్థుల

**తన శక్తి తాను తెలుసుకొని ప్రవర్తించాలి :** ఎవరుఏదిచెస్తే, అది చెయ్యటానికి పూనుకొంటారు కొందఱు. ఎంతటి వారితోనైనా తలపడటానికి సిద్ధపడతారు మఱికొందఱు. ఎదుటివారి మాటలు విని ఉబ్బి తబ్బిబ్బయి, కాని పనులుచేసి, కష్టాలు కొని తెచ్చుకొంటారు. పూర్వం ఒకప్పుడు ఈశ్వరుడు హిమవత్పర్వతంపై జేరి నిష్ఠగా తపస్సు చేస్తున్నాడు. పార్వతి ఆయనకు పరిచర్య చేస్తోంది. వివాహం జరిగాక వారికి కలుగబోయే బిడ్డ, తారకాసురుని సంహరించి, లోకాలను కాపాడు తాడని తెలిసింది. కార్యసాధనకై ఇంద్రుడు మన్మథుని పిలిపించి, అతనిని సభాముఖంగా పొగిడి, పార్వతియందు పరమేశ్వరుడు మోహంతోఅనురక్తుడయ్యేలా చెయ్యమని బాధ్యత అప్పగించాడు. ఆ పొగడ్తలకు పొంగిపోయిన మన్మథుడు ఈశ్వరునిపై సమ్మోహనాస్త్రం వేసి అతనికి తపోభంగం చేసాడు. కారణం తెలుసుకొన్న పరమేశ్వరుని కంటి మంటకు ఆహుతి అయ్యాడు. ఇచ్చకాల మాటలకు లోబడి అలవికాని పనిలో తల దూరిస్తే తంటాలు తప్పవు మఱి.

**మాటలకు సందర్భ శుద్ధి ఉండాలి :** మనం మాట్లాడే మాటలకు పూర్వాపర సంబంధం ఉండాలి. మనస్సులో అనేకమైన ఆలోచనలు మెదులుతూ ఉంటాయి. సందర్భాన్ని అనుసరించి అందులో ఏది ముందు, ఏది తర్వాత అని, నిర్ణయించుకొని, స్వవచన విఘాతం లేకుండా మాట్లాడాలి. అలా కాకుండా బుద్ధి హీనుడై మదిలో మెదిలిన ప్రతి ఆలోచన మాటలలో బయటపెడ్తూ, ఒకదాని, కొకదానికి పొంతనలేకుండా మాట్లాడే వాడిని 'పిచ్చివాడు' అంటారు.

**ఔచిత్యం పాటించాలి** : మన చేతి వ్రేళ్ళు ఐదు ఒకటిగా ఉండవు. ఒకే తల్లి కన్న బిడ్డలలో కూడా వారి, వారి జీవసంస్కారములనుబట్టి అన్నింటిలో ఎక్కువ తక్కువలు, గోచరిస్తాయి. సృష్టిలోని వైవిధ్యమే అది. ఆ విలక్షణతలోనే ఒక అందం, ఆనందం చోటు చేసుకొనటం గమనించగలం. అయితే అందులో మనం ఏస్థాయిలో ఉండి మాట్లాడుతున్నామో గుర్తుంచుకొని ఎదుటివాడి స్థాయి మఱచిపోకుండా, పరిసరాలను గమనిస్తూ, ( గుడి, బడి, గ్రంథాలయం) తమ వ్యక్తిత్వానికి భంగం లేకుండ గంభీరంగా, ఔచిత్య సుందరంగా, ముచ్చటించాలి. అలా కానప్పుడు తమ గౌరవం దెబ్బతింటుంది. పిల్లలతోను పిచ్చివారితోను అతి చనువుగా వ్యవహరింపఁబోతే అవమానాలు తప్పవు.



కల్పిస్తుంది. ఇతర ప్రాణులకు లేని ఈ అవకాశం, సద్వినియోగం చేసుకోవటం మానవత్వానికి గుర్తు.

**అనునయంగా మాట్లాడమే మంచిది :** లోకంలో ప్రాణులన్నింకి పెడతారంటే ఆశ, కొడతారంటే భయం కలగటం సహజం. ప్రియంగా అనునయంగా మాట్లాడితే సంతోషంతో ముసిముసి నవ్వులు నవ్వుతారు. దురుసుతనంతో, పరుషంగా మాట్లాడి అవమానిస్తే, దుఃఖంతో ముఖం చిన్న బుచ్చు కొంటారు. మాటలకేం కొఱత, అందులో నీ సొమ్మేమిపోతుంది కనుక, అనునయంగా మాట్లాడమంటాడు లోకహితాభిలాషియైన ఒక కవి. దాతృత్వము, ప్రియ వక్తృత్వము, ధీరత్వము, ఉచితజ్ఞత అనే ఈ నాలుగు ప్రాణులకు సహజంగా పుట్టుకతోవచ్చే సుగుణాలే కాని అభ్యాసంవల్ల ఏర్పడేవి కావు. అందులో దానం కూడా ప్రియ వాక్సహితమైనప్పుడే సత్ఫలితాన్ని ఇస్తుంది. సుగుణ సంపన్నుడైన రాముడు స్మిత పూర్వ భాషి, మృదు పూర్వభాషియేకాక ప్రీతి పూర్వకంగా కూడ మాట్లాడేవాడు. అందువల్ల అతడు 'లోకాభిరాముడని' కీర్తింపబడ్డాడు. ఇంటగెలిచి, రచ్చ గెలవటం నేర్చిన మహనీయుడతడు. 'అందఱివాడుగా అభిమానింపబడటానికి మాటతీరు ముఖ్యంగా పరిగణింపబడుతుంది. పెడసరంగా మాట్లాడేవాడిని పెరట్లోకి తోసేస్తారు.

**కార్యసిద్ధికి మాటలే ముఖ్య సాధనములు :** కౌరవ సభకు రాయబారిగా వెళ్తున్న కృష్ణునితో ధర్మరాజు అతని తమ్ములు, ద్రౌపది, చెప్పదలచిన మాటలు చెప్పారు. చివరకు మళ్ళీ ధర్మజుడు 'అన్నీ తెలిసిన నీకు, మేము వేరే చెప్పాలా? సమయోచితంగా మాట్లాడి, కార్యసాధన చేసుకొని రమ్ము, పొమ్ము అని విన్నవించాడు. ఆ కృష్ణుని మాటలు వింటే కౌరవ వంశ వినాశన హేతువైన భారత యుద్ధమే జరిగి ఉండేది కాదు. పోగాలము దాపురించిన వారికి మంచి మాటలు చెవి సొరవు. ఒకవేళ బలవంతాన వినిపించినా, ఒంట బట్టవు. అందుకే 'చెప్పటమే నా ధర్మం, వినకపోతే నీ కర్మం' అన్నాడు మనసుకవి ఆచార్య ఆత్రేయ.

**చెప్పిన మాటకు కట్టుబడి ఉండాలి :** మాటకేమి కొఱత? మాట్లాడమన్నారుకదా అని కొందఱు మాటలు కోటలు దాటేటట్లు చెప్పి, 'స్వర్గానికి నిచ్చెనలు' వేసి,

అఱచేతిలో వైకుంఠాన్ని చూపించటానికి ప్రయత్నిస్తారు. చేతలలో వెనకబడ్డప్పుడే మాటల జోరు ఎక్కువ అవుతుంది. ఉత్తర గోగ్రహణ సందర్భంలో 'సారథిలేడుగాని ఉంటేనా ఏమిచేసే వాడినో' అని అంతఃపురంలోని ఆడపిల్లల ముందు ప్రగల్భములు పలికిన ఉత్తరుడు యుద్ధరంగంలో కౌరవ సేననుచూసి, అతడు పడిన తత్తరపాటు మనకు తప్పక గుర్తుకు వస్తుంది. నవ్వు పుట్టిస్తుంది. <u>శక్తికి మించిన మాటలు చెప్పరాదు</u>. అన్నది ఇందులో సందేశం.

ఉత్పత్తి విలువలు తక్కువైనప్పుడు ప్రచారభేరి మ్రోగించి అన్నిరంగాలలోను వ్యాపారం జోరుగా సాగించటం మనం గమనించగలం. వాగ్దానాలు చేయటం తేలికే, అవి నెరవేర్చటమే చాలా కష్టం. సజ్జనుల మాటలు శిలాక్షరములతోను, దుర్జనుల మాటలు నీటి మూటలతోను పోల్చి చెప్తారు. 'ఒట్టి గొడ్డుకు అరుపు లెక్కువ' అన్నట్లు ఇట్లాంటి వారు మాటలు బాగా చెప్తారు, చివరకు చేతల్లో మొండి చేయి చూపిస్తారు. ఇతరులకు ఎంతో సాయం చేస్తున్నట్లుగా నటిస్తూ, లోకాన్ని నమ్మించటానికి ప్రయత్నిస్తారు. 'మాటలు మూటలు మాయింట్లో, మాపిడి భోజనం మీ యింట్లో' అన్నది వారి సిద్ధాంతం. ఇటువంటి వారి బ్రతుకు ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీలమోత. అల్పుడెపుడుపల్కు నాడంబరముగాను, సజ్జనుండు పలుకుఁ జల్లగాను కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?, విశ్వదాభిరామ! వినుర వేమ! అని వేమన చెప్పింది వీరి విషయంలో అక్షర సత్యమనిపిస్తుంది. ఆచరణలేని (ధర్మ) ప్రచారములు, అనుభవంలేని ఆత్మప్రబోధము కాలగతిలో మూలపడిపోతాయి.

**<u>చేతకాని మాట చెప్పరాదు :</u>** ఒకప్పుడు మాటల ధోరణిలో చేతకానిదాన్ని చేస్తానని మాట ఇస్తే, అది నెఱవేర్చేందుకు తాతలు దిగిరావల్సి వస్తుంది. అధికంగా మాట్లాడే వారికి మాట నిలకడ లేకపోవటం వలన పదిమంది ముందు పరువు దక్కదు సరిగదా! 'అబద్ధాల కోర'నే నింద కూడా వస్తుంది. అన్నిటికంటే ఎక్కువ ప్రయోజనాన్ని కలిగిస్తామని ప్రలోభపెట్టి, అసలుకే మోసంతెచ్చే విధంగా జెండాఎత్తేసిన (బోగస్ కంపెనీలు) దుర్మార్గులనుగూర్చి వింటూనే ఉన్నాం.

**<u>అయ్యో పాపమని దయ తలిస్తే, వారి ప్రాణానికే ప్రమాదం తెస్తారు :</u>** ఒకొక్కసారి



పోనిలే కదా అని ఏదో మాటఇస్తే, అది ఇచ్చినవాడి మెడలో ఉరిత్రాడై కూర్చుంటుంది. ఈ దుర్గతి మానవులకే కాదు, దేవతలకు కూడా తప్పలేదు. ప్రతి గ్రహీతలు రాక్షసులయితే మరీ ఇబ్బంది. పూర్వం ఒకప్పుడు రాక్షసుడొకడు, భక్తవశంకరుడు, సర్వశుభంకరుడు అయిన శివుని గూర్చి తపస్సు చేసాడు. కరుణామయుడైన శివుడు అనుగ్రహంతో అతనికి దర్శనమిచ్చాడు. 'తన హస్తం ఎవరి తలపై పెడితే వారు భస్మమైపోయే విధంగా వరంప్రసాదించమ'ని కోరాడు రాక్షసుడు. దయతో ఆ వరం ఇచ్చాడు శివుడు. 'నీ మాట ఎంత వఱకు నిజమో పరీక్షించి చూస్తానని ఆ శివుని నెత్తినే తన చేయి పెట్టటానికి ప్రయత్నించాడు ఆ భస్మాసురుడు. ఆత్మరక్షణకు పరమేశ్వరుడు పరుగెత్తుతూ ఉంటే, పంతం నెగ్గించుకొనేందుకు పట్టుదలతో వెంట పడ్డాడు రాక్షసుడు. చివరకు శ్రీ మహావిష్ణువు జోక్యం చేసుకొంటేగాని ఆ పీడ విరగడ కాలేదు. ఒక్కొక్క మాట వలన నిత్య జీవితంలో ఎదురయ్యే సమస్యలు ఇన్నీ అన్నీ అని లెక్క పెట్టటానికి కూడా వీలుపడదు. ఇంకదుష్టుల సంగతి వలన కలిగే బాధలనుగూర్చి వేఱే చెప్పనక్కఱలేదుకదా!

**<u>చెప్పటం సులభమే, చెయ్యటమే కష్టం :</u>** లోకంలో మఱికొంత మంది తమకు తోచిన ఆలోచనలన్నీ ఇతరులకు చెప్పి చేయించటానికి ప్రయత్నిస్తూ ఉంటారు. చేసేవారి శక్తి సామర్థ్యాలను గూర్చి వారు విచారించరు. తలకు మించిన భారం మోపితే నడుం విఱిగిపోతుంది. ఒకప్పుడు ప్రాణానికే ముప్పు సంభవిస్తుంది. తనది కాకపోతేసరి కాశీదాకా దేకమ'న్నట్లు ఉంటుంది వారి ఉపదేశ సారాంశం. 'ఎదుటి వారికి చెప్పేటందుకె నీతులు ఉన్నాయి.' అన్నట్లు ఆ నీతి బోధకులు వారు చెప్పింది వారే ఆచరించటానికి ముందుకురారు కానీ, ఇతరుల నెత్తిపై రుద్దటానికి ప్రయత్నిస్తారు. 'పరోపదేశవేళలో, అందరూ వ్యాస, పరాశరుల వంటి వారే' అని వక్కాణించినవారి మాటలిక్కడ గుర్తుకు వస్తాయి, ఆచరణలేని వారి సూచనలకు విలువ ఉండదు. కేవలం చిలుకపలుకులవలె అవి ఆత్మానుభూతికి దూరంగా ఉంటాయి. అందువల్ల లోకంలో ఆ మాటలకు ఆదరం, గౌరవం లభింపవు.



**మాట విలువ:**

ప్రతి శబ్దానికి ఒక శక్తి ఉంటుంది. ఆ శబ్దశక్తి మీదనే ఆధారపడి లోక వ్యవహారమంతా నడుస్తుంది. తన ఒడిలో ఉన్న శిశువుకు తల్లి ఉగ్గు పాలతోనే నేర్పేది మాట. బడిలో చేరిన విద్యార్థికి గురువు బోధించేది మాట, మంచి, చెడులను వివరించి, ప్రోత్సహించే మిత్రులు సూచించేది మాట, ప్రేమకు, ద్వేషానికి మూలమైనది మాట. ఇరుగు, పొరుగువారితో స్నేహమైనా, విరోధమైనా మాటవలననే ఏర్పడుతుంది. వ్యాపారరంగంలో ఇచ్చిపుచ్చుకోవటం మాటవలననే సాధ్యపడుతుంది. విశ్వాసానికి కారణమైనది మాట కావటంచేత, నిత్య జీవితంలో మాటకెంతో ప్రాధాన్యం ఉంది.

**మనసు తెలిపేది మాట – మనసు కోరేది మాట:**

మనసులో ఉన్న భావం తెలియజేసేందుకు ఉపయోగించేది మాట. సంతోషకరమైన (వార్త) విషయం ఏదైనా, తనకు ఇష్టమైన వారితో చెప్పుకొని పంచుకొని సంతృప్తిపడడం, కలిగిన దుఃఖాన్ని ఆత్మీయులైన వారికి వివరించి, వారి ఓదార్పు పొందటం మాటవలననే సాధ్యపడుతుంది. తన మంచితనాన్ని, తన సామర్థ్యాన్ని మెచ్చుకొనే అభిమానుల మాట కొఱకు పరితపించటం, కళలను ఉపాసించేవారు అందుకు విశేషంగా పాటు పడటం జరుగుతుంది. లోకంలో అభిమాన సంఘుల ఆవిర్భావానికి ఇదే కారణం.

**మాటకు సత్యమే ప్రాణము:** **" సత్యం కంఠస్యభూషణం "**

మాట మీద నిలబడే మనిషిని ప్రజలు గౌరవిస్తారు. దేవుడని కీర్తిస్తారు. మనసు, మాట, మనుగడ (ఆచరణ) ఒకటిగా ఉండటం వలన మానవులు మహాత్ములని కీర్తింపబడతారు.

# మాటలంటే మాటలా?
# ముత్యాల మూటలు, రత్నాల రాశులు.




రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

**డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D**

శివశ్రీ ప్రచురణలు

హక్కులు : రచయితవి

ప్రతులకు : శ్రీ శివకామేశ్వరీ గ్రంథమాల

కాంగ్రెస్ ఆఫీస్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ.

ఫోన్ నెం. 0866-6661777

వెల:



రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D

## శాస్త్రిగారి ఇతర రచనలు

1. శ్రీ రామకథామృతము - సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్సిటీ వారిచే *Ph.D.* పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)
9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీ త్రికూటేశ్వర త్రిశతి
18. విష్ణు సహస్రనామ వివరణము